

విజయవాడ మాచవరంలో హిందీ ప్రచారక ప్రశిక్షణ మహా విద్యాలయం పై భాగముతో నిర్మించబడిన కొత్తహాలునకు ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు ప్రారంభోత్సవము చేయుచున్నపుడు తీసిన ఛాయా చిత్రం.

ఫోన్; 36866

టెలిగ్రామ్: హిందీసంఘ్

# 480

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

మార్చి–1994

సంపాదకులు

వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర

ఖైరతాబాద్, హైదరాబాద్–500004

సంవత్సర చందా

40–00రూ॥

విడిప్రతి

4–00రూ

**Recommended for use in all the Public libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State, Madras, Vide proceedings Dis No. 30/55 dated 6th January-1955.**

---

# ఈ సంచికలో

సంపాదకీయం

# సమైక్యత

స్వతంత్ర భారతదేశ జనాభా ప్రస్తుతం తొంభై కోట్ల వరకు వుంటుందని అంచనా. ఆ తొంభై కోట్ల మందికి దాదాపు ఆరువందల భాషలు. ఎన్నో వందల మతాలు, కులాలు, సంస్కృతులూను! ఇన్ని విభేదాలున్నా భారతదేశం భిన్నత్వంతో ఏకత్వం సాధించుకునేందుకు నిరంతరం కృషి చేస్తూనే ఉంది.

స్వతంత్ర సంగ్రామ దినాల్లోనూ ఆ తర్వాత కూడా దేశమంతటా ఒక సామాన్య భాష వాడుకలో వుండవలసిన అవసరాన్ని గుర్తించే గాంధీ నెహ్రూవంటి మహాత్ములు అధిక సంఖ్యాకులు మాట్లాడే హిందీని అందుకు అనువైన భాషగా గుర్తించి ప్రచారం సాగించారు. అయితే జాతీయ భాషగా హిందీకి గుర్తింపు లభించిన తర్వాత కూడా కొన్ని రాష్ట్రాలలో ప్రజలు యితర ప్రాంతాల వారితో స్నేహ సంబంధాలు పెంపొందించుకునేందుకు, తమ తమ భావాలు ఆలోచనలు తెలియచెప్పి భావసామ్యాన్ని సాధించేందుకు అవసరమైన భాషగా హిందీని స్వీకరించేందుకు తయారుగాలేరు. అయితే సామాన్య ప్రజల సంఖ్య విద్యాధికుల కంటే ఎక్కువ అన్నది, వారిలో అధిక సంఖ్యాకులు హిందీనే వాడుక భాషగా వ్యవహరిస్తారు అన్నది కూడా జగమెరిగిన సత్యమే. అయినా పెద్ద పెద్ద పదవులలో వున్నవారు ఆంగ్లభాషకే పెద్ద పీట వేయడం వల్ల హిందీ భాష ద్వారా జాతీయ సమైక్యతను సాధించే ప్రయత్నం సఫలమవడం లేదు.

ఇప్పటికీ పార్లమెంటు, రాష్ట్ర శాసన సభలు చట్టాలను ఆంగ్ల భాషలోనే రూపొందిస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా చట్టాలను ఆంగ్లంలోనే రూపొందించి వాటి అనువాదాన్ని ప్రాంతీయ భాషలతో ప్రకటిస్తున్నాయి. అయితే హిందీ ప్రాంతీయ భాషగా వున్న కొన్ని రాష్ట్రాలు చట్టాలను హిందీలో రూపొందించి తర్వాత యింగ్లీషులోకి అనువదించి ప్రకటించినా యిటువంటి రాష్ట్రాల సంఖ్య బహు

తక్కువ. భారత దేశాన్ని రెండు వందల సంవత్సరాల పాటు తమ అధీనంలో వుంచుకుని మనకు కట్టపెట్టిన ఆంగ్లభాషకు యిప్పటికీ యింత ప్రాముఖ్యతను యివ్వడం చింతించవలసిన విషయమే. ఒక విదేశీ భాషలో దేశ పరిపాలనా వ్యవహారాలు నడపడం మరి ఏ యితర దేశంలోను లేదన్నది నిర్వివాదాంశం.

ప్రస్తుతం ఏ రాష్ట్రంలో చూసినా ప్రాంతీయతా భావాన్ని వేర్పాటు వాదాన్ని రెచ్చగొట్టేందుకు రాజకీయాలు నడిపే నాయకుల సంఖ్య ఎక్కువవడంవల్ల స్నేహంగా శాంతియుతంగా సహజీవనం సాగించగలిగే పరిస్థితులు మృగ్యం అవుతున్నాయి. వీరే సామాజిక ఐక్యతకు విఘాతం కలిగిస్తూ నేను, నా మతము, నా ప్రాంతము అన్న విష బీజాలు నాటి కులాల ప్రాతిపదికగా తక్కువ ఎక్కువ అన్న వేర్పాటు ధోరణిని ప్రజల్లో రెచ్చగొడుతున్నారు ఇటువంటి వారి ప్రయత్నాలు సాగనివ్వకుండా ప్రస్తుతం వున్న విభేదాలను అంతరింపచేసి ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలందరూ సమానులేనన్న గ్రహింపు కలిగించేందుకు పరస్పర అవగాహనకు అనువైన భాష హిందీయే అని గుర్తించి నవభారత నిర్మాణానికి పూనుకోవలసిన బాధ్యత ప్రజలందరిపైనా వుంది. ఈ సందర్భంలో ఈ సంవత్సరం అంటే 28 ఫిబ్రవరి 94లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారి ఆధ్వర్యంలో మద్రాసులో జరిగిన 58వ స్నాతకోత్సవంలో ఉన్నత పరీక్షలలో పట్టాలు పుచ్చుకున్న దాదాపు పన్నెండు వేలమంది విద్యార్థినీ విద్యార్థులకు ఆ పైన మద్రాసు, హైదరాబాద్ ఎర్నాకులం దార్వాడ్ స్నాతకోత్తర కేంద్రాలలో ఎమ్.ఏ, ఎమ్ ఫిల్. పి.హెచ్.డిలలో పట్టాలు పుచ్చుకున్న వారినేగాక యితర కేంద్రాలలో నడపబడుతున్న బి.యడ్ మరియు అనువాద డిప్లమాలను పొందిన వారినందరినీ అభినందిస్తూ జాతీయ సమైక్యతను సాధించేందుకు నడుముకట్టవలసిన గురుతరమైన బాధ్యతను మరొక్కసారి గుర్తు చేస్తున్నాము.

# సాహిత్యవీధి

## పుస్తక పరిశీలన

## దాశరథి కవిత—ఒక పరామర్శ

—శంకరగంటి రమాకాంత్

ఆంధ్రదేశములో కవులకు కొదువలేదు. వారిలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు కవిత్రయముగా పేరుపొందారు. మనకు ఆ కవిత్రయమంటే ఎంత ఇష్టమో, ఎంత గౌరవమో ఆ పదబంధమంటే కూడా అంతే ఇష్టము. శ్రీశ్రీగారు తన దృష్టిలో తిక్కన, వేమన, గురజాడలు కవిత్రయం అన్నారు. అలాగే గుంటూరు శేషేంద్ర శర్మగారు జక్కన, పిల్లలమఱ్ఱి పినవీర భద్రన్న, శ్రీనాథ కవిసార్వభౌములను ప్రబంధ కవిత్రయంగా సంభావించారు. అలాగే నేను ఆధునిక కవిత్రయంగా శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి గార్లను పేర్కొంటే సబబే అవుతుందని తలుస్తాను. శ్రీశ్రీ అభ్యుదయకవి. నారాయణరెడ్డి ఎంత నూత్న కవిత్వం వ్రాసినా ప్రముఖంగా భావకవి. దాశరథి భావాభ్యుదయ కవిత్వతత్త్వాల్లోని సుగుణాలను రెండిటినీ తనలో ఇమిడించికొని నవ్యరూప మెత్తిన మహాకవి. తిక్కన వ్యాసుణ్ణి తన భారతావతారికలో స్తుతిస్తూ అతణ్ణి 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశు'డని పేర్కొంటాడు అలాంటి భవ్య కవితా వేశం దాశరధిలో పరిపూర్ణంగా వుంది.

ఈ వ్యాసంలో 'దాశరథికవిత' అనే కావ్య సంకలనం లోని అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, పునర్నవం, అమృతాభిషేకం, కవితా పుష్పకం-అనే ఆరు కవితా సంపుటులలోని కవితలను స్థాలీ పులాకన్యాయానుసారంగా పరామర్శించటం జరిగింది.

దాశరధిగారు 'రుద్రవీణ' అనే కావ్యసంపుటి లోని 'రససమాధి' అనే కవితలో 'నా కవితాలతాంతము ప్రాత దనమ్మును త్రావి త్రేన్చి నాజూకగు క్రొత్తవాసనలు' చూపినదంటాడు. నిజమే. దాశరధి ప్రాతకవుల రచనలను బాగా పఠించి, మథించి ఆకళింపు చేసుకొని తదధ్యయన జన్యమైన కంఠదఘ్న సంస్కృతి బలంతో తన గొంతువిచ్చి పదుగురు మెచ్చే కవిత్వం వ్రాశాడు.

ఈ వ్యాసంలో నేను కావ్యసంపుటిని పాఠకుల కోసం కుండలీకరణంలో సూచిస్తున్నాను.

ఆంప్రదే బాలుర గురుకుల పాఠశాల, (వయా)మెట్‌పల్లి (పోస్టు, కోరుట్లమండలం, కరీంనగరం(జి)505325.

చంద్రోదయ ఖండికలో [అగ్నిధార] 'వచ్చినవాడు చంద్రముడు' అనేపద్యారంభం 'వచ్చినవాడు ఫల్గును దవశ్యము గెల్తుమనంగరాదు' అనే తిక్కన పద్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది. 'ఊర్వశి'లోని [అమృతాభిషేకం] 'మత్త భృంగాయితశింజినీ ధ్వని' అనే ప్రయోగం కూడా తిక్కనగారి "భద్రాయితమూర్తి" అనే ప్రయోగ ప్రభావమును కలిగివుంది. 'మధురథము' లోని [మహాంధ్రోదయము]

"కుసుమప్రేంఖద్రసాలాగ్ర నిశ్రేణిరోహత్ దొచుకరె
గమికర్మీభూతవాసంతముఙ్"

అనేపాదంలోని 'గమికర్మీభూత'లో నేనున్నానంటూ శ్రీనాథభట్టారకుడు చిరునవ్వులు చిందిస్తూ దర్శనమిస్తాడు. 'మధుమంజరి' కవితలోని (కవితాపుష్పకం) నువ్వుబువ్వు నవ్వు జవ్వని నాసిక కోపమున గులాబి రూపుదాల్చె' అన్న పద్యభాగంలోని మొదటిపాదం వేమకూరవారిదే. 'నీలిరవ్వ' అనే కవితలోని (కవితాపుష్పకం)' నల్లనివాడ, జ్ఞాననయనమ్ములవాడ, మనస్సు లోపలన్ తెల్లనివాడ' అనే పద్యం బమ్మెరపోతరాజుగారి 'నల్లనివాడు, పద్మనయనమ్ములవాడు' అనే పద్యానికి ముద్దుబిడ్డ. పద్మనయనాలు భౌతిక శరీరాన్ని వర్ణిస్తాయి. కాని దాశరథి జ్ఞాననయనానికి తన పద్యంలో స్థానమిచ్చి పోతనను అనుకరిస్తూనే కొత్తపోకడపోయి తనతనాన్ని నిలుపుకొన్నారు. మనుచరిత్రలో అల్లసానిపెద్దన అరుణాస్పదపురాన్ని అభివర్ణిస్తూ 'అచట పుట్టిన చిగురుకొమ్మైన చేవ' అంటాడు. అలాగే దాశరథి తెలంగాణాలో గడ్డిపోచయును సంధించెన్ కృపాణమ్ము' (రుద్రవీణ) అని గడ్డిపోచ కూడా కత్తి సంధించి 'దౌర్జన్యంపై తిరగబడింది అంటాడు. భీరువూ, పిరికీడూ తేడా లేకుండా నిజాం నవాబు పీడకి ప్రతివాడూ తిరుగుబాటు చేశాడని దీని అర్థం. 'రైతు' అనే ఖండికలో (అగ్నిధార)లో 'ఎన్నిపుణ్యాలు చేసి' జన్మించినావో! ఈధరాభామినీ మధురాధరాన అమృత మొలికించినావు నీ హలముతోడ హాలికా! వేనవేల దండాలు నీకు, అనే పద్యం దువ్వూరి రామిరెడ్డి రచించిన 'కృషీవలుడు' అనే కృతిలోని 'సైరికా! నీవు భారతక్ష్మాతలాత్మ గౌరవ పవిత్రమూర్తివి భూరమణివి ధారుణీపతి పాలనాదండమెపుడు నీహలమ్ముకన్నను ప్రార్థనీయమగునె?' అనే పద్యానికి సమఉజ్జీగా నిలుస్తుంది. 'జైల్లోనే' ఖండికలోని (అగ్నిధార) ఇట వసంతము లేదు. సహింపరాని గ్రీష్మ హేమంతకాల శాశితలెగాని ఇట ఉషస్సులు లేవు. భరింపరని అంబువాహ సందోహనిశాశిగాని' అనే పద్యం చదివితే'నాకు గాదులులేవు. 'నా కుషస్సులులేవు. నేను హేమంత కృష్ణానంతశర్వరిని' అనే కృష్ణశాస్త్రి గేయం గుర్తొస్తుంది. అదేఖండికలోని 'ఈకాలానల కీలికా వితతిలో ఏయిల్లు! ఏయూరు! ఏలోకంబాగును! ఎందరెందరు దరిద్రుల్ చచ్చిరో! ఏసతీ శోకం బాక్రమంటుచున్నదో! సుతుల్ చుట్టాలు చల్లారిరో! నాకున్ నీకు గణింపశక్యమె! దుఃఖతంత్రాంతి కాలాస్ఫుటుల్" అనే పద్యం చదివిన వెంటనే "ఆలోకించిన గుండియల్ గరగు నాయాపిల్ల గోరీలలో నే లేబుగ్గల సౌరు రూపరియనో యేముద్దు నిద్రించెనో యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించెనో యీ లోకంబున వృద్ధిగాదగిన యే యే విద్యలల్లాడెనో!' అనే జాషువా పాళీ (Go|deh Nib) దాల్చిన జాషువా రచించిన 'శ్మశానం' అనే ఖండికలోని పద్యం చప్పున స్మృతి పథంలోకి వస్తుంది. 'రుధిర దీపిక' అనే ఖండికలోని (రుద్రవీణ) 'ఈ చరిత్ర చీకటి గదిలో/ మెదులుతుంది. ఈ చరిత్ర అమ్ముల పొదిలో/ తైల దీపం వెలుతురులో/ వెదకి వేసారినా లభించేది/కనిపించేది పెద్దల పిద్యావంతుల తర తరాల బూజుల/వట్టి పాత రాజుల విలువలు— అన్న పంక్తులపై శ్రీశ్రీగారి 'దేశ చరిత్రలు' అనే యగ్రేప్రభావం కనిపిస్తుంది.

శాంతంగా వుండే మనిషి కోపం వచ్చి విప్ల విస్తే ఏమవుతుంది? అన్న అంశాన్ని 'జ్యోతిశ్చక్రం' (పునర్నవం)లోని 'మలయాచల చందన శిఖరం ప్రళయాగ్ని కురియడం నిఖరం' అనే మాటల్లో అలంకారసుందరంగా చెబుతాడు దాశరథి. అదే ఖండికలోని 'పల్లె పల్లె బంగారపు ముల్లె/ ప్రతి మనిషీ మల్లె/ అన్న చరణాలు దేశ సౌభాగ్యానికి పల్లె సీమలే ఆట పట్టులని, ప్రతి మనిషీ మల్లె పూవులాంటి స్వచ్ఛ హృదయం కలవాడని దాశరథి గారు భావించినట్లు తెలుపుతాయి. అదే ఖండికలోనే పిరికితనం మానవునికి మృత్యువు ధైర్యం సంజీవినీ గుళిక' అని పిరికిగుండెతో మథనపడే సామాన్యమానవునికి ధైర్యం చెబుతాడు దాశరథి.

మాట్లాడని మల్లె మొగ్గ మాదిరిగా నడిచిరా' అనే ప్రసిద్ధ చరణాలతో ఆరంభమయ్యే అచుంబితం 'అనే గేయం (పునర్నవం) లోని 'రాముని బాణానికంటె/ ప్రబలమైన జనకోపం/ అనే మాటలు జనుల కోపానికున్న శక్తి సామర్థ్యాలు ఎంతటివో తెలియ జేస్తాయి. రామ బాణం ఎదురులేనిదని, ఓటమిని ఎరగనిదని తరతరాల నుండి మన విశ్వాసం. అదే విధంగా కోపంతో మండిపడే సామాన్య జనానికి కూడా ఎదురుండదని, వాళ్లకు గెలుపు ఖాయమని దాశరధి గారి నిశ్చితాభిప్రాయము. 'ఆలోచనలంత లేత/ వైన అంగుళుల కొసలు అనేది నూతనోపమానం. 'కళ్ళుండే చూసే వాక్కుండే వ్రాసే' అని శ్రీశ్రీ గారంటే దాశరధిగారు 'క్రాంతికి కనిపించిందంతా కైతగా రాసేస్తున్నాను' అనే గేయం [పునర్నవం) లో తనకు తొలిగా కన్పించిన వారు' 'ముష్టిలోకం తలమీద ఇష్టం వచ్చినట్లు గా తన్నే అష్టైశ్వర్యాల వారు 'అంటాడు. అదే గేయంలో భవిష్యత్తులో దళిత ప్రజలు గెలుస్తారని ఆశిస్తూ ఆ ఆశను 'ఆ దూరాన కానవచ్చే అడుగడుగునా ఉదయాలు/ అంగుళం అంగుళాన హృదయాలు పతిత ప్రజా విజయాలు అనే మాటల్లో సూచిస్తాడు.

'రూపాయిల మ్రోతలేని రోజంటూ గడవదు తుపాకీలు లేకుండా దొంగతనం సాగదు' [పునర్నవం] అన్న ఈ కవి మాటలు ఎంత యధార్థాలో అందరికీ తెలుసు. కానీ కవిగారు 'రూపాయికి విలువలేని రోజు రేపు వస్తుం'దని ఆశాభావాన్ని కూడా ఆ గేయంలో ఒకచోట వ్యక్తం చేస్తాడు. 'రాలిపూలు అనేగేయం (పునర్నవం)లో దాశరథి గతాన్నీ, భవిష్యత్తునీ కాలమనే కరవాలానికి రెండంచులుగా భావించాడు. వర్తమానపు పూల వాసనగా భావిని భావిస్తా రీయన. ప్రేమలో, స్నేహంలో శక్తి ఎక్కువ. అనిగ్రహించిన దాశరథి' చిన్నపాటి అంకుశమున/గున్న ఏనుగును వంచే/కొత్తరకం పద్ధతి కను/గొన్నానండో రండో' (పునర్నవం) అని అందరికీ ఢంకా బజాయించి చెబుతాడు. 'హృదయం వినా నా దగ్గర/ఏ వస్తువు లభించదు/ఉదయం వినా నా కంటికి/ఏ వస్తువు రుచించదు' (పునర్నవం) అనే మాటలు దాశరథి స్వభావానికి ప్రతీకలు. 'మర్త్యంలో ఏ నాటికి/హర్షం లభియించబోదు' (పునర్నవం) అన్న నగ్న సత్యాన్ని కనుగొన్న కవి దాశరథి. కామంధుల, కామాంధుల, ధనాంధుల, మదాంధుల, రాబందుల కానిసలై పడి మూగవోయిన వాళ్ళు విప్లవ శంఖం పూరిస్తే ఆ దుష్ట పాలకుల్లో భయకంపాలు మొదల వుతాయన్న విషయాన్ని 'ఉషస్సంధ్య' అనేగేయం లోని (పునర్నవం) "గొంతుదాటి పలకని శబ్దాలు/ దాగున్నై ఇన్ని శతాబ్దాలు/ఆలకిందాం ప్రజాగళ గర్జన/దుమ్ములో తర్జన భర్జన' అనే మాటల్లో సూటిగా వ్యక్తీకరించారు.

చల్లని నీటిలో ఎంతో జలవిద్యుత్తున్నప్పుడు పల్లె వాని గుండెల్లో పెల్లుగా తిరుగు బాటుండదూ?

అని ఒక చోట ఆలంకారికంగా వర్ణిస్తాడు కూడా విప్లవం లేపదీయగలదన్న నిజాన్ని చెబుతా దీక్షవి.

రుద్రవీణ తీగ లంచవ్వుడు
వణికించును భీరులనిప్పుడు
నిరుపేదా! నాతోరారా
తేతేరా పలుగూపారా
రండి రండి బీదా బిక్కీ

కొట్టండోయ్ డమరూ ఢక్కీ (పునర్నవం)

అని తనతోబాటు పేదలను పిలిచి ముందుకు నడిపించే ఈ పాదాల్లో కష్టజీవికి ఇరువైపులా నిల బడేవాడే కవి అన్న శ్రీశ్రీ మాటలకు ఉదాహరణంగా కనిపిస్తాడు దాశరథి 'అంతర్నాదం' అనే ఖండికలో దాశరథి 'పీడిత ప్రజావాణికి' 'మైక్' అమర్చి అభవాదులకున్ వినిపింపజేసెదన్ (అగ్నిధార) అని అంటాడు.

'బాల్యం' అనే ఖండిక (పునర్నవం) దాశరథి భావుకతను ప్రతిబింబించే మణిదర్పణం. బాల్యాన్ని ఈ కవి 'జీవితలతాగ్రానపూచే నిర్మలమైన విరిరోజా'గా భావిస్తాడు. మానవుని బాల్యంలో సామ్యవాదం ప్రజాస్వామ్యం నిజంగా ఉన్నదంటాడు. మద్యం మాంసం మగువలను మకార త్రయంగా పూర్వీకులు భావించినట్లు' విమన్, వెల్త్, వైన్' అనే వాటిని మూడు దయ్యాలుగా చమత్కరించా డీకవి. ఈమూటికోసం మానవుడు మాడిపోతానంటాడు.

ఈకవి విభిన్న ధోరణులను తనలో విలీనం కావించుకొన్న బహుకవిమిత్రుడు. ప్రేమకవిత్వం ఎంతపసందుగా వ్రాశాడో విప్లవ కవిత్వాన్ని అంత ఉద్రేకంతోనూ వ్రాసి సవ్యసాచిత్వాన్ని ప్రదర్శించాడు. బీదలబాధలను చూచి ఆతడు మండి పోయి 'గ్రీష్మ మహాప్రబంధాలు' రచించాడు. విప్లవం కావాలని ఎంతగా కోరుకొంటాడో అంతగా శాంతిని కూడా ఆరాధించాడు. ఇతన్ని వర్ణించాలని తటిన్నటి పొంగిన బంగరు చన్నుదోయితో విహాయసం నుండి దిగివస్తుందట. (అగ్నిధార), 'వానలు' అనే ఖండికలో (అగ్నిధార) వసంతం వెళ్ళివానాకాలంవచ్చిన సంతోషంలో తనప్రియురాలితో 'బాలా ముకుళాయ మానవకుళంబులలో మక్కరందమెత్తునూ!" అని అంటాడు. 'పూచినముంద్లు' అనే గేయంలోని (కవితాపుష్పకం) ఈ పాదాలు ఆయన శృంగార కవిత్వాన్ని ఎంత సరళసుందరముగా వ్రాయగలరో నిరూపిస్తుంది చూడండి.

"నీవు నడచిన దారిలోనే నందనం/ నీ
పదమ్ముల క్రింది మన్నే చందనం
నీదు మేను పదారు వన్నెలకుందనం/నీకు
లోకమె చేయుచున్నది వందనం"

ఈ గేయం ఆయన ప్రాసక్రీడా సౌభాగ్యానికి పట్టుగొమ్మగా కూడా భాసిస్తుంది.

కష్టాల్లో సుఖాన్ని సందర్శించే విశేషదృక్కు ఈ కవికుంది. 'జైల్లో' అనేఖండికలోని నీళ్ళలోని నిప్పు మాదిరి నిప్పులోని నీళ్ళ మాదిం కష్టాల నీడలంబు సుఖమ్ము నివసించునంట! ఉస్సురను వేడి ఊర్పులోన పరిమళాలున్నవంట'' అనే ఈపద్యంలో (అగ్నిధార) నిట్టూర్పుతో నెత్తావులను ఆఘ్రాణిస్తా దీక్షవి.

'శ్రమికజాతి' గేయంలో (అగ్నిధార) 'శ్రమజీవుల రక్తధార జలంకన్న పలచనైంది.' 'విశ్వవిపణివీధుల్లో చావు చాల చవకైనది' అనేమాటలు ప్రత్యక్షరసత్యాలు. నేనువార్తాపత్రికల్లోని మనుషుల చావులను గురించిన వార్తలను చదువుతూవుంటే

పైమాటలు నేటికీ ఎంత నిజమైనవో తెలుస్తాయి. 'దీన పరాధీనజాతి/ శ్రమికజాతి/ దెబ్బతిన్న బెబ్బులి ఎలె/ మేల్కొన్నది' అని (అగ్నిధార) అంటాడీ కవి. ఈ ఉపశమనం శ్రమజీవి తప్పక వ్యాఘ్రమై తనను బాధించిన, వేధించిన వారలను తప్పక మట్టుపెడతాడని సూచిస్తుంది 'దీపావళి' గేయం (అగ్నిధార)లోని 'వ్యక్తులు పరిపాలించే/ శక్తినశించింది నేడు' అనే చరణాలు రాజరికవ్యవస్థ నశించి ప్రజాస్వామ్యం పరిపాలనా విధానం కావటాన్ని సూచిస్తున్నాయి. అందులోనే "వల్లని చమురుంటేనే/ జ్వాలావళి కీలావళి/ ప్రకాశలం వుంటేనే/ ప్రభుత్వాలూ రాజ్యాలూ" అని అంటాడీ కవి. దీపం వెలగడానికి నూనె ఎంత ముఖ్యమో, ప్రభుత్వాల రాజ్యాల అస్తిత్వానికి ప్రజలంత ముఖ్యమని ఎంత అందంగా చెప్పాడో చూడండి ఈకవి.

కంతో బాధపడే దీనులను గూర్చి పరితపించి, పలవరించి, కలవరించి దాశరధి కవిత్వం వ్రాశాడు. 'అంతర్నాదం' అనే ఖండిక (అగ్నిధార)లో బీదల దీనత్వమింకా ఎన్నాళ్ళు? అని ఆక్రోసిస్తూ "ఈశ్మశాన వాటి ఈనిశా నైల్యము మహాశిశిరము లెన్నినాళ్ళు? ఈక్షుధా జ్వరంబులీ వ్యధాభారంబులీ బికారి బ్రతుకులెన్ని నాళ్ళు?" అని ప్రశ్నిస్తాడీకవి.

సమాజములో శ్రామికునిశక్తి ఎంతటిదో గుర్తించిన మహాకవి దాశరధి. అందుకే 'శ్రామికుని వేడినిట్టూర్పులకు ప్రపంచ మెన్నడో కాలి బూదికాకున్నదేమొ?' అని రుద్రవీణ అనే కావ్యసంపుటిలోని 'ముక్తభూమి' అనే కవితలో అంటాడు. శ్రామికుడు తన శ్రమకు తగినఫలమును అందుకోలేనాడు అతడు బాధాక్రోధాలతో వేడి నిట్టూర్పులు విడిస్తే వాని సెగల పొగలకు రగిలి భూమిని బూదిగుప్పగా మార్చే శక్తివుందని విశ్వసిస్తాడీ కవి.

'మహాంధ్రోదయ' కావ్యంలోని 'మధురథం' అనే ఖండికలో వసంతరుతువును వర్ణిస్తూ 'ఆకులాలి దిగంబరమైన నాదు శుష్క జీవనభూజంబు చుట్టు కొనగ పూంపుట్టమ్ము లొసగిన పుణ్యమూర్తి మాధవుడు వనరాజ్యరమాధవుడు' అని అంటాడు. గుడ్డలులేనివారికి గుడ్డలను ప్రసాదించిన దయామయహృదయముగల పుణ్యమూర్తికి ఆకురాలి మోడైన చెట్టుకు పూలు అనే వస్త్రాలందించిన వసంతుణ్ణి ఊహిస్తూ ఈ సందర్భంలో బీదలకు చేతనైన సాయం చేయటం ముఖ్యమని కాంతాసమ్మితంగా, ముఖ్య సందేశమందించాడు దాశరథి.

దాశరధిగారు పూలు, ఆకులు రాలిపోయి దిగంబరత్వం ప్రాప్తించబోతున్నదని చెట్టు సిగ్గుతో కొమ్మలనే చేతులను బారసాచి మాధవమూర్తిపై అనాటి ద్రౌపదికన్నా వేయిరెట్లు ఎక్కువగానిరీక్షిస్తూ విలపిస్తున్న దంటాడు. ఇందు 'మాధవ' శబ్దం వసంతుడు, కృష్ణుడు అనే రెండు అర్థాలను సంతరించుకొని ప్రయుక్తమైనది.

ఈయన శాంతి ప్రియత్వం కల కవి, అందుకు 'మహాంధ్రోదయ' కావ్యంలోని 'కపోతీ సందేశం' ఒక మచ్చుతునక 'ఒకరి నొకరకు ద్వేషించి ఒకరి గళము నొకరు నొక్కి కపోష్ణాస్రు మోడ్చి త్రావి-త్రోతి-వానిని చంపి సంతోషపడెదు మాకు' అనే ఈ మాటల్లో మనుషుల్లో స్వార్థంపెరిగి, కరుణ తరిగి పోవటం వలన వాళ్లెంతటి క్రూరులుగా, స్వార్థ పిశాచములుగా మారిపోయారో తెలియజేస్తాడు దాశరధి.

దాశరధిగారికి శాంతిప్రియుడైన గాంధీ గారంటేమహాఇష్టం.'క్షమామూర్తి' (మహాంధ్రోదయం)

అమృతమూర్తి (కవితాపుష్పకం) అనే ఖండికలు ప్రబలనిదర్శనాలు.

''అతడు బంగారము నందెట్టి విలువను పరికించి ఎరుగని వైశ్యవరుడు. కత్తితో శత్రువు కడతేర్చగలమన్న బాద స్తములు లేని క్షత్రియుండు బ్రహ్మవిజ్ఞానంబు పదిమందికేయను వర్గీకరణ లేని బ్రాహ్మణుండు అణగారి పడియుండుట నీతియను టను కాలదన్నిన మేటికార్మికుడు అంటరానివార మని అలమటించు పంచముల హరిజనులని పాంచజన్య మూది పలికిన హరిజనాభ్యుదయవాది గాంధిమహనీయుడే లోకబాంధవుండు అని 'క్షమా మూర్తి'లో దాశరధి ఒకపద్యం వ్రాశాడు. ఇందు శూద్రవర్ణాన్ని కార్మికశబ్దంతో అభివ్యక్తం చేయటం అతనికి వారిపట్లగల గాఢ అభిమానమునకు ఉదాహరణ ఇలాంటి శిల్పమనోహరమైన పద్యం వ్రాయటం బహుకష్టం, అనితరసాధ్యం. గాంధీస్వభావములోని ప్రత్యేకతను ఈ పద్యం పట్టియిస్తుంది. ఇలాంటి పద్యాన్ని వ్రాయటానికి అసాధారణ ప్రతిభాసంపత్తి కావాలి. ఇటువంటి సీసపద్యాన్ని గాంధీని గూర్చి ఇంతవరకూ ఏకవీ వ్రాయలేకపోయాడేమోనని అనిపిస్తుంది. అంతెందుకు? దాశరథిగారే గాంధీని గురించి 'అమృతమూర్తి' అనే ఖండిక వ్రాస్తూ ఇలాంటి పద్యాన్ని మళ్ళీ వ్రాయలేకపోయారు.

''సాహిత్య సామ్రాజ్యం' (మహాంధ్రోదయం) అనే ఖండికలో

"ఏనాడెవ్వరు కత్తితో గెలువ లేదీ
విశ్వమున్, ప్రేమపా
శానంగట్టుము నాలుగుంబది ప్రపంచాలన్
మహాత్ముండిదే
జ్ఞానోద్బోధము చేసె, నెవ్వడు వినెన్
సాహిత్య సామ్రాజ్యం
దైనంగొంతగా శాంతిపాదు కొననిమ్మా నీకు
షట్యంబగున్.''

అని ప్రేమ, మానవత, శాంతి మొదలగు గుణాలు ప్రజలకు అలవడే రీతిగా సుందర సందేశాల నందిస్తూ రచనలను చేయవలసినదిగా దాశరధి గారు భావికవులకు మార్గదర్శనము చేశారు.

'అమృత పాతము' (అమృతాభిషేకము) అనే ఖండిక చంద్రుని గూర్చి వ్రాసినది. చంద్రుడు 'నింగి నుండి తొంగి చూచినపుడల్ల అమృత పాతమ్ము జరుగు యౌవనమ్ము పెరుగు కలత లెల్ల తరుగు కవితా సరస్వతీ మృదు పదాలు నాల్క మీద తిరుగు' అంటాడీ కవి. మధురంగా రచన చేయటంలో దాశరధి దిట్ట అనటానికి ఉదాహరణగా నిలుస్తుంది.

కవులందరికి కమ్మని వెన్నెల వర్ణనీయ వస్తువయితే దాశరధి చీకటిని గురించి కలాన్ని వసందుగా చిందులు త్రొక్కిస్తాడు. 'స్త్రీ ముఖానికి కస్తూరి బొట్టు పెట్టి, సుందరి చెంప పై దిష్టి చుక్కగా నిలిచి, ఆదిశేషువై చీకటులు లోకానికి అందాన్ని సమకూర్చిన వంటాడు దాశరథి.

'ఊర్వశి' (అమృతాభిషేకం) రవీంద్రుని రచనకు అనుసరణ. భావకవులందరికి ఆరాధ్య దేవియైన ఊర్వశి ని గురించి దాశరథి కూడా కవిత రచించి భావకవిగా తన నేర్పరితనాన్ని నిరూపించు కొన్నాడు.

"పొంగిన నీ ఉరోజముల పొంకము, నీ చెలువంబు చూపుకన్నుగవ, నీ కపోలముల నున్న దనంబు, యుగాలు పాడినన్ బొంగురు వోని నీ గళము, నొక్కులు దేరిన నీ నకాలకల్''.

నింగియు నేలయుంబలెనె నిల్చును శాశ్వత యౌవనంబునన్. అన్న ఈ పద్యం చక్కని పద

గుంభనకు నిదర్శనం. ఇందులో ఒక్కటైనా అనవసర పదమన్నది లేదు అల్లసాని వాని అల్లిక జిగిబిగి, ముక్కు తిమ్మన ముద్దు పలుకల తియ్యదనం ఈ పద్యంలో కానవస్తోంది. పద్య నిర్మాణ మార్మికత తెలిసిన ఆధునిక కవుల్లో ఈయన ఒకరు.

'చేతనాజ్యోతి' (అమృతాభిషేకం)లో గుడిసె లోగల చిన్నికూన కనులలోని నవ్వులను, బంగారుమేడలోని క్రొత్తకోడలి చూపులోను, గగనంలోని తారలోను, మేఘమనే పానుపుపై ఒంటరిగా పవళించలేక పొరలాడే మెరుపులోను దీపాలను దర్శిస్తాడు కవి. 'ఆకాసౌధం' (అమృతాభిషేకం)లో ఉండడానికో సౌధం ఉండక పోయినా గానీ ఆకాసౌధాన్నైనా అధిరోహిస్తే తప్పా!' అంటాడు. మనకు లేని దాన్ని కావాలని కోరుకోవటం మానవ నైజం కదా! ఆ గేయం లోనే భువిని దివిగా మార్చి వేయటానికి చెప్పారు వారు. చూడండి. "మనిషి మనిషినీ విడగొట్టే ధనాన్ని నిర్మూలించామంటే నరులంతా ఏకమై సురలోకం నిర్మించరూ!"

దాశరధికి మేఘమంటే అమోఘమైన ప్రీతి ఎందుకని అంటే మేఘంలో కరుణ గుణంగా కనిపిస్తుందట. దాని గుండె కంటనీటి కుండట. మేఘం కరుణించి ప్రజలకు వానసందించి సేవ చేస్తుంది. అందువల్ల ఆయనకు మేఘ మంటే అంతటి ప్రేమ.

'కవితా పుష్పకం, అనే పుస్తకంలోని 'శాంతి'ని గురించి పదహైదు పద్యాలు హృద్యాతి హృద్యాలు.

నీ వెట నుందువో అచట నిమ్మగ లింకపు
లేళ్ళు జంకవున్
పూవులు వాడ, వంధతమముల్ భువినాదవు
పండు వెన్నెల ల్
జీవము పీట, పత్రువులు చిందవు, గుండెలు
కుందకు, పక్షిరా
జీవములందు రాగమునశింపదు, ద్వేషము
సంభవింపదున్.

ఈ పద్యం శాంతి యొక్క గొప్పతనాన్ని అద్భుతంగా అభివ్యక్తం చేస్తుంది. ఐదు బాణాల గుచ్ఛం శాంతి కాంత కబరీ భరం లో పూలగుత్తి అయి అందాలొలుక బోస్తుందట.

దాశరధికి మంచు చినుకు మంచి ముత్యము కన్నా అందమైనదిగా కనిపిస్తుంది. 'శాంతి' (కవితా పుష్పకం) అనే గేయములో 'తృణాగ్రమున గల హిమ బిందువు మణులకు కడు దగ్గరి బంధువు అని అంటాడు. అందువల్లనే 'కరంగన్ లేని రాళ్ళందు వ్యామోహం బె[illegible] లేదు నాకు హృదయంబున్ సాచితిన్ రాగదే!' అని మంచి చినుకును ఆహ్వానిస్తాడు ఆషామాషీ కవి అయితే ఈ సందర్భాన 'హృదయంబున్ విప్పితిన్ రాగదే' అనేవాడు. హృదయాన్ని సాచడం అన్నమాట దాశరధి వక్రోక్తి వైచిత్రికి ఉదాహరణ. కరగని రాళ్ళంటే వ్యామోహం లేనట్లే రాతి గుండె మనుషు లంటే కూడా వ్యామోహము లే దీ కవికి.

'మధులహరి' ఖండికలో 'కషకు 'కల్మషమ్ములకు కాలము కాదిది' అంటాడు. ఇక్కడ కూడా శాంతిప్రియత్వం కానవస్తుంది. అశాంతిలో అలమటించే జగత్తు శాంతిని తప్పకపొందుతుంది అని అతడు భావిస్తాడు. 'ఈ అశాంత ధరణి ఎన్నడో ఒకనాడు శాంతినందుననుట భ్రాంతికాదు' అంటాడీ కవి.

ఉగాది వెలుగులలో కూడా ''పేదవారి గులాబీల మీదనేను/ పద్దెములు వ్రాయనెంచితి;/ ముద్దులొలుకు పల్లెపడుచు కచమ్ముల నుల్లసిల్లు/ మోదుగునుమించి నట్టి పువ్వేదిజగతి?" అంటూ పేదవారి పూలమీదే పద్యాలు వ్రాస్తాననడం ఆయనకు దరిద్రప్రజానీకం పైగల ఆదరానికి పరాకాష్ఠ. అట్లే తన ప్రేయసి ''నేను మోదుగుపూల్ తెచ్చినానన్న దోసిటగల మల్లెలు పారబోసికొనును'' అంటూ 'సహజ వాసనగల మల్లె సరమకన్న ప్రణయవాసనగల వలాశగుచ్ఛము మిన్న' అని సందేశమిస్తాడు. దాశరథికి సువాసనల మల్లెపూల కన్న పరిమళం లేకున్నా ప్రేమకు చిహ్నమైన మోదుగులంటేనే ఇష్టం. 'కవితాపుష్పకం' లోని 'మధుమంజరి' క్రీస్తీ లేని ఒరకుకాంతి లేనట్లుగా 'అతివలేకయున్న బ్రతుకు సున్న' అంటాడు దాశరథి. ఒరవుండి కరవాలం లేకుంటే ఒరవల్ల ప్రయోజనం శూన్యం. అలానే స్త్రీజతలేని పురుషుని బ్రతుకు శూన్యమని ఉపమానం ద్వారా చెబుతాడు. స్త్రీకత్తిలాంటిది.పురుషుడు ఒర. కత్తికి ఒర రక్షణ కలిస్తుంది. అలా స్త్రీకి పురుషుడు రక్షణ కలిగిస్తాడని కూడా ఈ ఉపమానం ద్వారా దాశరథి చెబుతాడు.

గాలి కూడా తన ప్రియురాలి ఒంటి సువాసన లపు పీల్చడం దాశరథిగారికిష్టంలేదు. 'మధుమంజరి' ఖండికలో మరొకచోట 'ఆమెచెంత కేగు హక్కెవడిచ్చెనో గాలి ఆమె పరిమళాలు పీల్చె' అని గంధవహుణ్ణి మందలిస్తాడు.

'కవితాపుష్పకం' అనే కావ్యసంపుటిలోని నవవసంత వైభవము' అనే కవితలో ''కోట్ల చిలుక ముక్కు లిట్లేకమైనట్లు కింశుకమ్ము అందగించెనే నేడు పేదవాని మదిని పెకిలివచ్చిన ఆశ అరుణ తరుణమగుచు విరిసెననగ'' అని దాశరథి గారంటారు. వసంతకాలంలో మోదుగుచెట్లు విరగ బూస్తాయి. అవి చిలుక ముక్కుల్లా ఎర్రగా వున్నాయి అవి పేదవాని మనస్సును చీల్చుకొని బహిర్గతమైన ఆశలాగా వున్నదట. మోదుగ పువ్వుల్లో పేదవాని ఆశను దర్శించటం దాశరథి దీనదళిత దరిద్రప్రజా పక్షపాతానికి ప్రబల నిదర్శనం.

అలాగే వాసనలేని మోదుగపూలంటే ఈశ్వవి గారికి వల్లమాలిన ఇష్టము. 'నవవసంతవైభవము' అనే కవితలో శ్రీమ:తుల్ స్పృశియింపబోరని వెతంజెందన్ పనేలేదు, సంధ్యామంజు ప్రభలీను మోదుగుపూవుల్ ధన్యంబులెన్నెన్నియో

నోముల్ నోచిన గాని యబ్బవు గదా నూత్నాబ్ద
శోభోల్లసద్
'గ్రామీణ ప్రమదా వినీల కబరీ రంగస్థలీ
లాస్యముల్'
అని మోదుగు పూలను ఓదారుస్తాడీ కవి,
[కవితా పుష్పకం]

'పూలకెరటాలు' (కవితాపుష్పకం) అనే కవితలో 'వంచకుల' జిత్తులకు తలలు వంచు కాలం అరిగె అంటూ దగాకోరుల మోసాలకు కలిగ్గే కాలం నశించిందంటాడు దాశరథి. 'సంక్రాంతి రాత్రి' (కవితా పుష్పకం) అనే గేయంలో 'పరమాత్మను చేరలేక చింతించితి' అంటూ ప్రేమలో ఆధ్యాత్మికతను జోడిస్తాడు.

'వలపు సేతువు' (కవితా పుష్పకం) అనే గేయం ముత్యాల సరాల్లో నడుస్తుంది. అందులో 'క్రమం తప్పిన సొగసులోనే అధికముగ ఆకర్షణమ్ము' అనే చక్కని సూక్తి ఉంది.

దాశరథి స్నేహశీలి. స్నేహానికి ఎవరు చేయి సాచినా హృదయంసాచి అందుకొనే విశాలహృదయ

మున్న వ్యక్తి దాశరథి. అందువల్లనే ఆయన 'స్నేహగీతి' [కవితాపుష్పకం] లో

'దోస్తీని మించినది లేదు లోకాన/రత్నాల కంటె అది మిన్న తూకాన/మిత్రుడే కావాలి సుఖమునా శోకానా/అతడు లేకున్న చో నగరమే కాన' అంటాడు. అలాగే 'పునర్నవం' అనే కవితా సంపుటిలోని 'నా పేరు ప్రజాకోటి' అనే ఖండికలో 'ఎవడైనా మానవుడే ఎందుకు ద్వేషించడాలు? శాత్రవునైనా మైత్రికి లానిత్తును భయంలేదు' అంటాడీ కవిధీరుడు.

ప్రతికవికీ కొన్ని పదాలన్నా, కొన్ని పదార్థాలన్నా పరమ ఇష్టంగా ఉంటుంది. ఈ కవికి చషకమనే పదమన్నా, 'మోదుగుపూ' లన్నా ఐలేమోజు. ఈయన "ఆమనిలో చషకమ్మునెత్తుదా, 'మధుకాలంలో చషకమ్ము నెత్తుడి', 'సురాచషకమ్ము నొక్కెనో' అని చషక శబ్దాన్ని పలుమార్లు ప్రయోగించారు. 'పూచిన మోదుగుంబువులు', ధుమధుమలాడసాగినవి తూరుపుదారుల మోదుగుంబువుల్', "నిప్పుపువ్వులు మోదుగు కొప్పులోన', 'సెమ్మెపై దీపాలవలె వికసించె మోదుగు 'పువ్వులు", మోదుగులు పూచినవి దీపజ్వాలలై' అని పలుమార్లు తన కవితలలో మోదుగు పూలను ప్రస్తావించాడీకవి.

పదాలు దాశరథి ఎలా చెబితే అలా వింటాయి. బాసను తనకు బానిసగా చేసికొని పాఠకులచే సెబాసనిపించు కొన్న కవితాశరథి దాశరథి.

[illegible] అనే కవితా సంపుటిలోని 'పదే పదే' అనేస్తా' అనే గేయంలో 'మేదను పత్తోస్తయి మెదనే విడదీస్తాయి' అని ఒకచోట అంటాడు. 'మేద' అనే పదంలోని తొలి దీర్ఘాన్ని హ్రస్వం చేస్తే 'మెద' అనే పదం తయారైంది. 'ఖేదం, అనే గేయంలో 'ప్రజాలకు, రణాలకు మరణాలు' అని అంటాడు నరకంలో లోకం నరలోకం' (కవితా కోవం) అని చమత్కరిస్తాడీ కవి.

దాశరథి తన హృదయ స్పందనలకు కవితావేశం జోడించి అక్షర రూపం కల్పించి కృతులను నింపాడు. అతని కవితల్లో ప్రతి పదంలో అతని కంఠగల గుండె డిండిమంలా వినిపిస్తుంది. అందువల్లనే అతని పద్యాల కంతటి చేవ. ఈ కవి సంఘంలోని దురన్యాయాలను, దౌర్జన్యాలనూ దుయ్యబట్టుతూ పద్యాలు వ్రాశాడు. ఆయన 'ముసలి నక్కకు రాచరికంబు దక్కునే' అన్నా' 'మానిజాం రాజు జన్మ జన్మాల బూజు' నా తెలంగాణ తల్లి కంజాతవల్లి అన్నా ప్రతి మాటా కవితా మయమై జాతి జనులు సంస్మరించే మంత్రాల్లా మారాయి. దాశరథి యావదాంధ్ర దేశం గర్వింప దగ్గ ఆధునిక మహా కవుల్లో ఒకరని చెప్పటానికి తెలుగు వాడు తలదించు కోవలసిన పని లేదు. అతని కృతులు అమరకృతులు

# "ఆరోహణ" లో మానవతా విలువలు

—ఎన్. ఈశ్వరరెడ్డి

తెలుగు సాహిత్యంలో కావ్యం, కథ, గేయం, నవల, కథానిక నాటకం, వచనగేయం, వచనం, ఇలా పలురూపాలుగా విస్తరించిన కవిత్వంతోపాటు ఆరోహణ క్రమంలో ఉన్నత శిఖరాన్ని అధిరోహించిన తక్కువ మంది కవుల్లో డా.సి.నారాయణ రెడ్డిగారు ఒకరు. అందరికీ ఆశలుంటాయి. కొందరికే సఫలీకృతమౌతాయి. చాలా తక్కువ మందికి నెరవేరుతుంటాయి. అటు ఆశల్ని, ఇటు ఆశయాల్ని నెరవేర్చుతున్న మహోన్నతవ్యక్తి సి.నా.రె. "సి.నా.రె. వ్యక్తిత్వం నిజంవెత్తు తెలుగు సంతకం"అంటారు. ఆచార్యగోపిగారు. "సాహితీ వనంలో నిండైన కల్పవృక్షం సి నా.రె. అంటాను: నేను. దేశ దేశ, స్థానం, స్థాయిలు ఎన్నిమారినా ఆయన వ్యక్తిత్వం మారలేదు. పాలసముద్రంలో పుట్టిన అమృతం సి.నా.రె హృదయామృతం ముందు ఏపాటి నిలవగలదు. ఆయనకున్న ప్రతిభతో పాటు ఆయన వెన్నంటి నడుస్తున్న మంచితనం, మానవత్వం, చురుకుదనం ముందుచూపు ఆయన్ని ఇంత పైకి తీసుకురాగలిగాయని చెప్పవచ్చు. తెలుగు కవిత్వం ఎన్నిరూపాలు దాల్చినా, ఎన్ని ప్రక్రియ వహించుకున్నా, ఎన్ని ఇజాలను చవిచూసినా, సి.నా.రెను లొంగదీసుకోలేకపోయింది. ఆకాశంలో చంద్రుడు తరుగుతాడు, పెరుగుతాడు. కాని సాహిత్యంలో సి.నా రె.ప్రతిబింబం వక్రించదు. సి.నా.రె షష్టిపూర్తి కానుకగా అచ్చేయించిన 'ఆరోహణ' కవితా సంకలనాన్ని గురించి ప్రస్తావిస్తాను.

'ఆరోహణలో మొదటి కవిత 'నన్ను విడిచి వెళ్ళకండి' ఇందులో

"నన్ను విడిచి వెళ్ళకండి.
నా వెన్నంటి నడిచే నీడలారా........"

లోకంలో అందరూ ఒకే తల్లికి పుట్టలేరు, ఒకే స్థాయికి ఎదగలేరు. కవి ఎంత ఎత్తుకు ఎదిగి పోయినా కింది స్థాయిని మరువలేదు.

"ఎందుకొదిలి పోతున్నారు నన్నుహఠాత్తుగా
నాచుట్టూ ఒంటి స్తంభంమేడ నిలిచిందా?
స్వచ్ఛందంగా ఎగిరే నాజుట్టుమీద
పరువైన కిరీటం దిగబడిందా ........

అరువు తెచ్చుకున్న కోటుకన్నా, సొంతగోచి మేలంటారు. అలాగే హఠాత్తుగా వచ్చిన సౌఖ్యం, సంపద నాకవసరంలేదు. మీతోనే ఉంటాను అంటారు సి.నా.రె. ఎందుకో తెలియదు గాని 'ఆరోహణ'ను చదువుతుంటే, చిన్నప్పుడు వేమన పద్యాలు చదివినంత హాయిగా ఉంది. అస్పష్టత ఈషణ్మాత్రం కూడా కనబడదు.

"చిన్నప్పుడు చింతచెట్టుకు వీపురుద్దితే
పలకరించిన వచ్చినెత్తురు తడి........"

తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్యపీఠం, రాజమండ్రి, బొమ్మూరు—533 124.

ఈ మాటల్లో ఎంతో సహజత్వం కనిపిస్తుంది. సి.నా.రె. ఆచార్యులుగా పనిచేసినా, ఉపాధ్యాయులుగా పనిచేసినా, 'జ్ఞానపీఠ' అవార్డు అందుకోగలిగినా, ముసుపటి జీవితాన్ని మరచిపోలేదు.

"మైదానమంత ఊపిరితో," 'వేళ్ళకుర్చి' 'గుండె' కవితలన్నీ సి.నా.రె. అంతఃమథనాన్ని ప్రతిబింబిస్తాయి. మైదానమంత 'ఊపిరితో' కవితలో

'...............
తిరగబడ్డాయి నాకళ్ళు
ముసుగులమీద

మూడోరకం పేడి నటనలమీద....'

'వేళ్ళకుర్చి' కవితలో........

అరిస్తే ఆకుర్చీ అదురుతుందా?
పైగ్రతిలో పాడే కోరస్ అనుకుంటుంది
...............
పాతుకుపోయిన వేళ్ళతు ఊపిరాడక
పైకి చీల్చుకొస్తే తప్ప'

'గుండె' కవితలో,

'ఏంచేయను
పుట్టుకతోనే నాకు ఒళ్ళంతా గుండె
ఏకాలికి ముల్లు గుచ్చుకున్నా అది
పచ్చి నెత్తురై అరుస్తుంది...'

పైమాటల్ని వింటే ప్రతిజీవి తన ఎదుగుదలకు సి.నా.రెను ప్రామాణికంగా తీసుకోవాలంటారు. హృదయానికి, శరీరానికి మధ్య పోలికల్ని చెప్పేతీరు మంచిచెడ్డలను గిరిగీసి వేరుచేసినంత నికార్సుగా ఉంటుంది. కాలాన్ని, లోకాన్ని, ప్రతిభావంతంగా వీక్షించి సమసమాజంలో మానవత్వపు విలువలు ఎంతకిందికి దిగజారిపోయాయో, మనకళ్ళముందు వెండితెర నావిష్కరించి రంగుల స్కోపులో చూపించాడు.

'నాతోట' కవితలో

తోట ఒళ్ళో తూటాల వగ్నహూత్కారాలు
సితిపుష్పాల నిత్యహత్యలు
న్యాయవృక్షాల సజీవదహనాలు
తోటనిండా కాటికంపు ,/

రక్తాన్ని నీటిధారగా పోసి
పాదుపాదులో ఊపిరిని
పచ్చపచ్చగా నింపేసి
మళ్ళీ నాటుతాను ఆతోటను
పక్షుల్లా, పువ్వుల్లా కలిసిబ్రతికే
సరికొత్తతరం కోసం'

కుళ్ళుకంపు కొడుతున్న దుర్భర సమాజాన్ని మార్చడానికి ప్రాణాలను సైతం లెక్కచేయకుండా, భవిష్యత్తు తరంకోసం 'మళ్ళి నాటుతాను ఆతోటను పక్షుల్లా పువ్వుల్లా కలిసి బ్రతికే తరంకోసం' అనడంలో ఎంతో ఆవేదనక్షి కనబడుతుంది. భావి తరాన్ని మార్చగలిగే ఆత్మస్థైర్యం, అకుంఠితదీక్ష వ్యక్తమౌతుంది. 'విశ్వాససేతువు' కవిత నమ్మకాన్ని కాపాడగా 'విస్ఫోటం' కవిత దుస్సమాజంపై తిరుగుబాటు చేస్తుంది. మానవ సమాజంలోని పేదలను చిన్నచూపుతో చూసే వారి హృదయ తంత్రులను తెగనరుకుతుంది. ఈ 'శిథిలభవనం' కవిత..................

నడినెత్తికెక్కిన ప్రమత్తభ్రాంతిలో
ఎగిరిదూకింది శిథిల భవనం

అర్ధజ్ఞాన ప్రేరిత మిథ్యా స్వప్నపరిస్థితిని'

సంపదను చూసి గర్వపడేవాడు అవమానానికి తప్పక గురౌతాడు. అని చెప్పడంలో ఎంతో నైపుణ్యం కనబడుతుంది. 'వాక్యుక్షు 'వస్త్రాప హరణం' కవితలో ఎప్పుడో చచ్చిపోయిననీతి– ఇప్పుడు గుప్పుమంటున్నది గుప్తశవంలా... సమాజంలో నీతి చచ్చిపోయి గుప్తశవంలా కంపు గొడుతోంది అంటే ప్రతిమనసూ మనిషిపై తిరగ బడి ప్రశ్నిస్తుంది. 'ఒడ్డు' కవిత ఈతగాణ్ణి ప్రస్తావిస్తుంది. శ్రమజీవి. లోకం, కాలం, మధ్యగల సంబంధాలను ఈ కవిత వివరిస్తుంది. కాలం వారే సెలయేరు. గట్టెక్కిన వాడికే లోకం సలాం కొడుతుంది. ఆర్థికంగా వెనుకబడిన వ్యక్తిని అదోగతిపాలు చేస్తుంది. 'శ్రవణ సంస్కృతి 'కవితలో"...కొట్టుకొనివచ్చిన వార్తలన్నిటినీ

నింపుకోకు గుండె సంచిలో
చెరిగిచూడు చేట చెవులో...'

లోకులు పలుకాకులు అనే సామెత ఊరికే రాలేదు. ఇక్కడ ఒకడు జారిపడ్డాడు అంటే చాలు. అది ఇంకోచోట వాడు చచ్చిపోయాడు అని మారిపోగుతుంది. అందుకే నిజానిజాల్ని బాగా పరిశీలించి నిర్ణయాలు తీసుకోమంటుంది పై కవిత. విశ్వాసాన్ని కోల్పోవద్దంటుంది. 'నెత్తురు విరగ నివ్వకు' కవిత. విశ్వాసం లేకుంటే జీవితంలో మనిషి ఏదీ సాధించలేడు అంటాడు సి.నా.రె. 'తల' కవితలో యజమానికి లేదా అధికారికి ఉన్న బరువు బాధ్యతలను గుర్తుచేస్తాడు. చీపురుపుల్ల నుండి శ్రీరాముని వరకు అవలీలగా వర్ణించగల సామర్థ్యం సి.నా.రె లో ఉంది. కాబట్టి తీసుకున్న వస్తువుకు శిల్పనైపుణ్యంతో న్యాయం చేయగలుగుతున్నాడు.

'అంకెలచక్రం' కవిత మరోసారి 'విశ్వంభర'ను గుర్తుచేస్తుంది. ప్రతిపంక్తి కవిత కవికి-కవిత్వానికి ఉన్న విలువల్ని చూపిస్తుంది. రాసిన కవిత్వం, జనం గుండెల్లోకి రామబాణంలా దూసుకుపోయి, హృదయాల్లో నిలిచి పోతేనే దానికి విలువ ఉంటుంది. 'ఉక్తి' కవిత. 'అఖాతం కవితలో మనసుల్లో రగిలే వ్యథకు ప్రతిఫలంగా కాల్చుకు చచ్చే ఇరుదేశాం సంస్కృతి కనిపిస్తుంది. అఖాతం అంటే అజ్ఞానం. పరిణతి చెందని విజ్ఞానం కారణంగా మనుషుల మధ్య అవగాహనారాహిత్యం ఏర్పడి తమను తామే నశింపచేసుకొంటోంది మానవసమాజం. 'నామీుందే' కవితలో ఎంత అనుభవాన్ని గడించినా, ఎంత విజ్ఞానం సాధించినా నేర్చుకోవలసింది ఎంతో కొంత మిగిలే ఉంటుంది. మనిషి వృద్ధుడై పోయినా మనసు మాత్రం ముసలిది కాలేదు. అందుకే మనసును అప్పుడే 'తెరచిన చిగురుకూన' అనటంలో ఎంతో ప్రజ్ఞ కనబడుతుంది. ఈ 'ఆరోహణ' కవితా సంకలనంలో ప్రతి కవితా ఒక మణిపూసే. ఒక్క అక్షరాన్ని కూడా వృథా అని చెప్పలేము. ''కవిత సాక్షిగా చెబుతున్నాను'' కవితలో కుల సంకుల కూపాలతో, విద్వేషాల వలయాలతో సమసమాజం లో అడుగడుగుకు ఓ స్మశానం ప్రత్యక్షమౌతుంది. నమ్మకాన్ని వమ్ము చేస్తోంది. మానవలోకం అంటూ ఆవేదన చెందుతూ— — —

ఒలిచి చదివినా అగుపడని
నొసటి రాతలనా —......

అంటున్న ఈ కవిత మనుషుల్నే కాదు కొండల్ని కూడా కరిగిస్తుందని పిస్తోంది. "పొదుగు" కవితలో చిన్నప్పటి నుండి తనకింత నీడ నిచ్చిన ఇల్లు గురించి అద్భుతంగా రాశాడు సి.నా.రె ''పొదుగు'' లోంచి.

"పేగులాగుతున్నదన లేను గానీ
మూగ రెప్పలకు తడి అంటుకున్నది
విశ్వంభరకు పురుడు పోసిన గది
వెళుతున్నావా బాబూ అంటున్నది......"

కన్న తల్లి కన్నా, ఇల్లు ఎక్కువ ఆవేదన చెందుతున్నట్టుగా కవి, కవిత నల్లదం హృద్యంగా ఉంది. సి.నా.రె వద చిత్రాలు, ప్రయోగాలు కళ్ళు ముందు కదలాడుతాయి. ''అంతే మరి' మిని కవితలో . . ''

చిగిర్చిన చెట్టు మీద
చిలకలు వాలుతాయి
చీడపురుగులా పాకుతాయి.

అతి చిన్న మాటల్లో అనల్పార్థం దాగి ఉంది. ఎంత గొప్ప దేశమైనా, సంస్థయినా' కుటుంబమైనా మంచితో పాటు చెడ్డను కుడా కలిగి ఉంటుంది. ఎంత విలువైనా తోటను పెంచినా పిచ్చి మొక్కలు మొలవకుండా ఉండవు. ''ఎండ'' కవితలో . . . సాయంత్రం ఎండ చచ్చు ముసల్ది/వంగి పోయిన వెన్ను ముకతో వాలి పోతుంది నేలను కరుచు కొని'' ఈ కవిత మందే ఎండకు మాత్రమే వ ర్తిస్తుందనుకోనవసరం లేదు మనిషి బాల్యం—యవ్వనం—వృద్ధాప్యం దశలో మనిషి ఎలా ప్రవర్తిస్తాడు? ఎందుకు ఆస్థాయిని చేరుకుంటాడు? అనేది తేట తెల్ల మౌతుంది. దీన్ని మానవ జీవితానికి ఉపమానంగా చెప్పు కోవచ్చు. నేల లాంటి ఓ నూలు చీర కవిత కోరికలే గుర్రా లైతే స్వారీ బిక్షగాడిది అన్నట్లు మనిషిని ఆశలు వదిలేస్తే ఊహాలోకంలో విహరించి పాతాళంలో పడిపోతాడు అంటుంది ఈ కవిత . . . కళ్ళల్లో ఆశ రీళ్ళు లాగ తిరుగు తుంటే.

....కాలం గుడ్లప్పగిస్తుంది
మెదడులోని ఒక్కొక్క రక్త కణం

— — — — — —

ఓ సినిమాస్కోపు తెరవుతుంది'
ఇమేజరీ చీరలు పులుముకున్న ఊహ
వివస్త్ర అవుతుంది నగ్నసత్యం తాకిడికి'

ఆశలు మనిషిని మించి పెరిగితే అవి మనిషికే ప్రమాదం. 'ఎర్రకారం పీల్చేశ్వాసలు' కవితలో అక్షరానికున్న విలువ విశద మౌతుంది. 'ఉద్యమించే కలం' కవితలో కలానికి అంటే కవికి లోకంలో ఉన్న పాత్రను గురించి వివరిస్తుంది ...' కాగే కలం ఊరుకోదు.

తాగిన ఎండను రక్తాని కెక్కించుకోనిదే'.. పై మాటలు కవికి ఎంతో స్ఫూర్తినిస్తాయి. ఆక్రాముల పై అంకుశాల్ని కురిపిస్తాయి. దోచుకుంటున్న వ్యవస్థను చిన్నాభిన్నం చేస్తాయి. ''ఎక్కడి కెళుతున్నారు కళ్ళు కడవల్లో దుఃఖాన్ని మోసుకొని ''మాటలు గుండెను పిండేస్తాయి. ఆ కన్నీళ్ళకు కారణమైన వాణ్ణి ముక్కలు ముక్కలు గా నరికేస్తాయి. పై మాటలు "పిచ్చి మొక్క" కవితలోనిది. బాధల బరిని తొడుక్కున్న ''గుండె'ను గురించి మాట్లాడుతూ,

" ఎలా ఉన్నావంటే ఏ మంటాడు
కులాసాగానే అనడం తప్ప
తిప్పి చూడు గుండె జేబును
తిరగ బడ్డ కుట్లెన్నో".

మనిషి గుండెల్లో రగిలే మంటల, వేడిని తాకాలంటే మనసుల్లోకి చొచ్చుకొని పోవాలి అప్పుడు ఎదుటి మనిషి బాధను అర్థం చేసుకోగలం. ప్రశ్నంటే స్వేచ్ఛ" కవితలో

''ప్రశ్నను బంధిస్తే
ప్రాణ వాయువులకు ఉద్యమాల రెక్కలు
మొలుస్తాయి
రెక్కలకు ఆంక్షల వలలు బిగిస్తా
ఎగిరి పడతాయి దళిత స్వరాలు
సాగర స్వరంతో" . . . .

స్వాతంత్ర్యం, స్వేచ్ఛ మనిషికి ముఖ్యం. ఆస్వేచ్ఛను హరిస్తే జరిగే పరిణామాలను

పైకవితలో వివరించాడు. 'పొదగని గుడ్లు' కవితలో మనిషి స్వభావాన్ని వివరించాడు. 'ఖాళీసీసా' కవితలో ..'' వగలగొట్టకో సీముఖాన్ని/పొడుచుకొస్తాయి పదునుబాకులు' అనడంలో ఉద్యమస్ఫూర్తి కనిపిస్తుంది. 'దిశాసూచీ' కవితలో కవిత్వం కృత్రిమ పిండోత్పత్తికాదు. అంటాడు. నిజమే, కవిత్వం ఎప్పుడు పడితే అప్పుడు అనుకున్న విధంగా రాయలేం. కవిత్వం రాయాలంటే గుండె కంపించాలి. 'ఎదుగుదల' కవిత ఉన్నతస్థాయి చేరుకున్నవ్యక్తి కిందిస్థాయిని మరచి ప్రవర్తిస్తే వాడివిలువ 'సున్న' అని ఉద్బోధిస్తుంది. 'పాత్రధారులు' కవిత ముసుగు తొడుక్కొని నటించే మనిషిని సమాజంతో నిజంగా కలిసి బ్రతకమంటోంది. సాధక బాధకాలు కలిసి పంచుకోవడమే మంచిబ్రతుకు అంటుంది. ఈ కవితలోని ప్రతి మాటా బండగుండెల్ని పేల్చే ఒక్కొ-గ్రెనేడ్.

'నిండుగర్భిణి కడుపులోని పేగుల్ని
నంజుకుతినే కత్తినాల్క...'

ఒకరినొకరు వెన్నంటి బ్రతికే వాళ్ళ కుల మత ద్వేషాలతో కత్తులు ఝళిపించి కాలగర్భంలో కలిసిపోతున్నారు. నమ్మకం నశించినచోట ఎవర్నీ నమ్మకు అంటుంది. 'నీడపడగ' కవిత.'లోయపడి' కవిత సంపదతో గర్వపడేవాడికి, మంచితనంలో బ్రతికే వాడికి, గల విభిన్న మనస్తత్వాన్ని గురించి వివరిస్తుంది. 'చమురుచీకటి' కవిత నిన్న మొన్నటి ఇరాన్–అమెరికా యుద్ధకాండనువివరిస్తుంది. మానవత్వం చమురు బావుల్లా మండిపోతుంటే మనిషికి నీడెక్కడ దొరుకుతుంది?

'మానవతా నువ్వెక్కడ
గడగడ వణికి పోతున్నావా
రొద్దురోళరుకింద గడ్డిపోచలా...'

మానవత్వంలేని మనుషుల ఉనికి ఎలా ఉంటుందో ఈ కవిత చెబుతుంది. 'శస్త్రదృష్టి' కవిత తనుపట్టిన కుందేలుకు మూడే కాళ్ళు అనే మూర్ఖులపై సంధించిన అస్త్రం. ''మట్టే కదా అని' కవిత నేలతల్లిని, ఆతల్లిబిడ్డల్ని దోచుకునే రాక్షస మూకకు ఒక విప్లవశంఖం......

'కురిసే పాలలో రక్తంనురగలు చూస్తే
గోవుకొమ్ముకు గొడ్డళ్ళవుతాయి....'

పై వాక్యాలలో ఎంతో తిరుగుబాటు ధోరణి కనిపిస్తుంది. "కొలమానం" కవితలో జ్ఞానాన్ని కొలవలేము. పుస్తకానికి విలువ కట్టలేముఅంటాడు. 'జనస్పర్శ' కవిత మనిషి మనుగడ కోరుకోలేని ఎంతగొప్ప విజ్ఞానమైనా వృధా అంటుంది. పొగ-కుట్ర, కుతంత్రం, దగావంటి వాటికి ప్రతీక. నిప్పు నిజానికి ప్రతీక. నిప్పు కూలిపోతే కొమ్ముకాస్తుంది వంచన అంటుంది పొగ కవిత. బోడిగుట్టలు కవిత నేటి రాజకీయం, అధికారం, పదవి వంటి వాటి స్వరూప స్వభావాలకు అద్దం పడుతుంది.

'వేళ్ళకు నమస్కారం' కవిత తల్లికి ఇంకో సారి నమస్కారం చేయిస్తుంది. ఎంతగొప్ప మనిషైనా ఒక తల్లికి బిడ్డేకదా! దాని విలువలు పైకవిత చాటుతుంది.

'అరవయ్యో అడుగు' కవితలో మనిషి పుట్టినప్పటినుండి అరవై సంవత్సరాల వరకు ఎదిగి, అప్పటి వరకు తాను సాధించిన ప్రగతినీ, గడించిన అనుభవాన్నీ, అక్షరూపం చేశాడు సి.నా.రె. ఆరోహణ కవిత మనిషి ఉన్నత స్థాయికి ఎదగాలంటే ఎన్ని దక్కా ముక్కీలు తినాలో ఎన్ని కష్టాలు పడాలో తెలియజేస్తుంది. ఆరోహణ కవితా సంకలనంలో సి.నా.రె మనస్తత్వం, హృదయం కనబడుతుంది. అన్ని కోణాలనుండి మానవతా విలువల్ని చాటుతోంది. ఈ 'ఆరోహణ' అనుభవ జ్యోతితో అక్షరాల్ని వెలిగించిన డా.సి.నారాయణ రెడ్డి తెలుగు హృదయాల్లో నిత్యం విరబూసే వింతైన తామరపువ్వు.

# గంగిరెద్దు-రమణీయ కావ్యం

వై. నాగయ్య

పల్లా దుర్గయ్యగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి మొట్టమొదటి ఎం. ఎ తెలుగు డిగ్రీని సంపాదించారు. అదే విశ్వవిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకులుగా, ఆచార్యులుగా పని చేసిన వీరు గొప్పపండితులు, కవి. విమర్శకులు, వీరి కలం నుండి వెలువడిన 'గంగిరెద్దు' కావ్యం ఎంతో కమనీయమైంది. రమణీయమైంది.

నేరుగా కథారచనతోనే కావ్యాన్ని ప్రారంభించి, ముగించడం; పల్లెల్లో తిరుగాడే బసవన్న కథను తీసుకోవడం; రైతుకుటుంబాలలోని సాధకబాధకాలను వివరించడం, నాటకీయ సరళిలో వింత కోడె జననంతో కావ్యం మొదలు పెట్టి, దానికి కారణమైన ఆకోడె పూర్వజన్మ వృత్తాంతం తర్వాత వర్ణించడం వల్ల ఈ కావ్యం ఆధునికతను సంతరించుకొన్నది. సంప్రదాయబద్ధమైన పద్య రచనతో నడవడం వల్ల ఇది సంప్రదాయ కవిత్వంలో చేరుతుంది. ఇట్లా పాత క్రొత్తల మేలు కలయిక ఈ 'గంగిరెద్దు' కావ్యం.

పేదకాపు ఇంట్లో ఆవు ఉంటుంది. అది కూడ అప్పు క్రింద గ్రామకరణం దగ్గర తాకట్టు పెట్టబడి ఉంటుంది. రైతు ఆవును పోషిస్తూ పాలు మెరుగు తను వాడుకొంటూ, దానికి జన్మించే పెయ్యలను కరణానికి ఇచ్చునట్లు కోడెను తను తీసుకోనట్లు కట్టడి చేసుకొంటాడు కాపు తన వ్యవసాయానికి పనికి వస్తుందనే భావంతో కోడె పుట్టాలని కొరుకొంటాడు. కాని మొదటిసారి పెయ్యే పుడుతుంది. మాట ప్రకారం దానిని కరణానికి ఇచ్చి వేస్తాడు. తర్వాత రెండు తోకలతో మూపురంపై కాలుతో మరోకోడె పుట్టుతుంది. వింత లక్షణాలు కల్గియున్న కోడెను చూచి, కాపు ఈసారి కూడ తన కోరిక నెరవేరనందుకు నిరాశ పడుతాడు గ్రామ ప్రజలు ఆ వింతను చూడటానికి తండోపతండాలుగా వచ్చి పోతుంటారు.

ఆ కోడె అవలక్షణాలతో పుట్టడానికి కారణముంది. పూర్వ జన్మలో మొదట ఒక ఆవుగా పుట్టుతుంది. యజమాని దానిని చిన్నతనంలో ప్రేమగా చూచి, పెరిగిన తర్వాత ఎన్నో కష్టాలకు గురి చేస్తాడు. ఆవు ఎంతో మొరపెట్టుకొని, మరుజన్మలో కోడెగా జన్మిస్తుంది. అయినా కష్టాలు తప్పవు. ఈ రెండు జన్మాల యందు తను సుఖంగా గడిపిన జీవితాన్ని మరుజన్మలో శాశ్వతంగా ఉండేటట్లుగా పుట్టించమని పరమేశ్వరున్ని వేడుకొంటుంది. దాని ఫలితమే ఈ వింత కోడె జన్మ.

వ్యవసాయానికి ఉపయోగపడనట్లున్న కోడెను చూచి, కాపుదంపతులు వ్యధ చెందుతాడు.

ఇంటి నెం. 6-99, మడికొండ-506 142.

అది బటారులో పోవుచున్నప్పుడు కొంతమంది వింతగా చూస్తుంటే, మరి కొంతమంది రాళ్ళు విసిరి యిబ్బంది పెట్టేవారు, కొంత కాలానికి దాని తల్లి చనిపోతుంది. అప్పుడు ఇల్లు విడిచి వెళ్ళిపోవాలనుకుంటుంది. ఏగ్రామంలోకి వెళ్ళినా ప్రజల అవహేళన తప్పదని, అడవులో ఉండటానికి భయపడి తిరిగి తిరిగి గంగిరెద్దులవాడి చేతికి చిక్కుతుంది. బసవన్నగా మారిన ఆ కోడె గ్రామ గ్రామం తిరుగుతూ, ఒక రోజు తను జన్మించిన గ్రామమే చేరుకోవడం జరుగుతుంది. గతంలో వింత ఆకారాన్ని చూచి చీదరించుకొన్నవారే, ఇప్పుడు దాని ఆటపాటలను, అలంకరణలను చూచి భక్తిని ప్రదర్శిస్తారు. కాపు దంపతులు కూడా తమ ఇంటి ఆవుకు పుట్టిన కోడెగాని గుర్తించి ఆప్యాయతతో సత్కరిస్తారు.

కవి 'గంగిరెద్దు' కావ్యంలో ఈ కథను అతి రమణీయంగా తీర్చిదిద్దినాడు. కవి ప్రతిభనుచూపు వర్ణనలు, ఉత్ప్రేక్షలు, సమాజ చిత్రణం, కరుణ రసప్రవృత్తి జాతీయాలతో కూడుకొని ఈ రచన సహృదయుల నాకర్షిస్తుంది.

కావ్యంలోని వర్ణనలు సందర్భానుసారంగా ఎంతో రమణీయంగా ఉంటాయి. ఆ పేద కాపు ఆవుకు కోడె పుట్టినదో వ్యవసాయం చేసుకొంటు, తమ కుటుంబాన్ని చక్కబరచు కోవచ్చుననుకుంటాడు. వారి ఆశలు నిరాశలై, వింత జంతువుగా పుట్టిన కోడెను చూచి ఆ ఇల్లాలు ఇట్లా దుఃఖిస్తుంది.

'బొటబొట కంట నీరొలుకబోసి బలోలబ
మంచు చేతులన్
పటపట నెత్తిమొత్తుచు దిటాటిబటాగుండెలు
గ్రుద్దుకొంచున
క్కటకట యెట్లు గాలెమన కర్మమటం
చును నేడ్చుచుండ మం
గిట పరిమంది గూడి పదికించదొడంగిరి
తద్విచిత్రమున్'

కోడె తల్లి చనిపోయిన తర్వాత ఇల్లు విడిచి అడవులు పట్టుకొని పరుగెత్తుతుండగా దారిలో ఒక వాగు, దారి ప్రక్కన పెద్ద మఱ్ఱి చెట్టుకనబడుతుంది. అది వాగులు నీరు త్రాగి ఆ చెట్టు నీడన విశ్రాంతి తీసుకొంటుంది. ఆ మఱ్ఱి చెట్టును నలుగురు పొడిచినా కూడా అమరని మొదలు కల్గి, సూర్యకిరణాలు చొరబారనంత దట్టంగా పఱచినట్లుండి వచ్చని పత్రాలు కల్గియున్నదని వర్ణిస్తూ–'కొమ్మకొమ్మకు నూర్ల మోకులు బిగించి'

పాతిరన వ్రేలు మారల బరిధ విల్లి,
వేయి స్తంభాల గుడితోడ వియ్యమంది
విఱ్ఱవీగెడి యూడల మఱ్ఱి కాంచె.–
అని మఱ్ఱిని వేయిస్తంభాల గుడితో సరియైందిగా చెప్పడం ఎంతో గొప్ప భావన.

సంక్రాంతి పండుగను తెలుగు వారు ఆనందోత్సాహంతో జరుపు కొందురు. పండుగ రోజులలో ఆడపడచులకు కలిగే సంతోషం, వారు తీర్చిదిద్దు రంగవల్లులు, గొబ్బియల్లు, ఊరూరు తిరుగు సాతానిజియ్యరు, జంగమయ్య, బుడుబుక్కల, గంగి రెద్దుల వారి స్వభావాలు, అప్పుడు నిర్వహించ బడుచుండు కోడి పుంజుల, పోట్లాటలు ఈ కావ్యంలో కనువిందుగా చిత్రింప బడినవి.

ఉదాత్తమైన భావనలు, ఊహలు ఈ ఈ కావ్యంలో కోకొల్లలుగా కన్పిస్తాయి గోవు ప్రక్కన వవళించియున్న కోడెను 'తెల్ల గొంగడి బోవువలెన్ శయించు' అంటారు ఆరేకుల పిండీకృత గాటులను బాతుల అను

కొన్నట్లు, ఈ కోడె తెల్ల గొంగడిం బ్రోవు వలె ఉన్నదని కవి భావించడం ఎంతో మనోహరం. కన్నతల్లి చనిపోగా కోడె ఇల్లు విడిచి వెళ్ళిపోవ డాన్ని కవి అద్భుతంగా—

తండ్రి కొట్టెనేని, తల్లి కోపించిన
కనులు మూసికొని 'టికట్టు' లేక
రైలుబండిలో జొరబడుబాలుని భంగి
ఇల్లు విడిచె కన్నతల్లి పోవ'

అని చెప్పారు.

నేటి సమాజ దుస్థితిని, లోకంలోని వ్యక్తుల విపరీత లక్షణాలను సమయం దొరికినప్పుడల్లా ఎత్తి చూపుచు, కవి అటువంటి వారిని హేళన కూడ చేస్తుంటాడు. ఎటువంటివారు పెద్దమనుషులుగా చలామణి అవుతున్నారో చెప్పుతూ—

బలవంతుడో/ధనవంతుడో
బలమగు నధికారయుతుడో బలముగ
తుమ్మన్
జలుబయ్యే ఫలాన కవి
తెలుపును స్పత్రికలు పేద తీరెవగున్.

అని అంటాడు.

పేదస్థితిలో నున్న వ్యక్తిని సమాజం లెక్క చేయదు. అతని స్థితి మారి, డబ్బు సంపాదించి ఎదిగినప్పుడు సమాజం ఆ వ్యక్తికే వత్తాసు పలు తుంది. ఛీదరింపబడిన ప్రజల చేతనే పూజింపబడు తున్న గంగిరెద్దు స్థితిని—

'వీపు కాలు చూచి వెకిలి నవ్వులు నవ్వి
తోక జంట చూచి దూఱువారె
అట్టి కాలుతోక లాదరమ్మున గాంచి
బతితోడ చేతులె త్తిరి గద!

అని వర్ణిస్తూ—

'వారల మోము మీదనే పరచిన యట్లు వచ్చి
మనసారగ వారల మ్రొక్కు లందెగా!' అని కవి ప్రజల వీపుమీద ఒక్క చరుపు చరుస్తాడు.

చరిత్ర నడుస్తూంది. ప్రభుత్వాలు, పార్టీలు మారుతున్నాయి. అయినా పేదవాని స్థితి మారటం లేదు. సమాజంలో పేదల దయనీయస్థితిని హృదయ విదారకంగా వర్ణించి, వారియెడ దుర్గయ్య గారు తనకు గల సానుభూతిని చూపాడు.

'మిద్దెలా మేడలా యిల మీద పేద
కాసులా పాసులా బీద కవని యందు
రోసమా వేసమా దరిద్రుడనకు జగతి
ఆశ మాత్రమే నిజపేద ఆస్తి యని'

— అని పేదవాని స్థితిని వర్ణిస్తాడు.

జనపదాల్లో అలుమగలు పాలనీళ్ళ వలె ఏ విధంగా కలిసి మెలిసి ఉండి కష్టసుఖాల్లో చేదోడు వాదోడుగా ఉంటూ, జీవన మాధుర్యాన్ని అను భవిస్తూ, జీవితాలలో ఉత్సాహాన్ని పొందుతుంటారో ఈ కావ్యంలోని కాపు కుటుంబ చిత్రణంలో చూడ వచ్చు. చూలితో నున్న ఆవుకు కోడె పుట్టాలని కాపు, పెయ్యపుట్టాలని కాపు పడతి కోరుకొంటారు. ఇంతలో గోవు ఈనుతుంది. అప్పుడు వారి సంభాషణ ఇట్లా సాగుతుంది. ఈ రేయిగోవీనె, నీవేమోయంటివి పెయ్యపుట్టునవి, కాదె కోడె యౌనంటిరా, వేమేపోదము చూచుకొందమిక నీవె గెల్తువో, గెల్తునో;— అని కాపు అన్నప్పుడు భార్య సమాధానం ఎంతో సరసంగా ఆప్యాయంగా ఇట్లా సాగుతుంది. సరెసరె మంచిమాట! యిటు సంగతి వారసి పంతమాడుటల్, పరుసయె? అదిదైన బరువా? మగదూడకి కొమ్ములుండునా? అరయగ పెయ్యపాడికగునట్టులె కోడెయుకాదికందు. నీవరుసన నెవ్వరోడినను వచ్చెడి లాభము వచ్చునే కదా!

మూపురమున ఒకకాలు, రెండు తోకలు కల్గి పుట్టిన కోడె వ్యవసాయానికి పనికిరాదుగదా! యని బాధపడుచున్న కాపును ఓదారుస్తూ, ఇరువురం కూలికి కుదిరి నాగలిపట్టి తను దున్నుచుండగా విత్తనాలుచల్లుతూ, అతని అడుగులో అడుగుంచుతూ నీడనై వస్తానంటుంది. కాయకష్టం బీదలకెప్పుడూ ఉన్నదే కాబట్టి ఆడవాళ్ళకు పనిచేసుకోవడానికి తిరుగలి, కొడవలి రోకలి; మగవాళ్ళకి నాగలి; గొడ్డలి యున్నందున దిగులుపడాల్సినపనిలేదు. చెరిరెండు చేతులను కలిపి నాలుగు చేతుల సంపాదించి, మనకు లేదనుకుంటున్న కోడెను బేరము చేతామంటూ ధైర్యాన్ని చెపుతుంది.

కావ్యంలోని రచన అంతా కరుణారస భరితంగా సాగుతుంది. కాపు దంపతులు అసలే పేదవారు. కోడెపుట్టుతే వ్యవసాయం చేసుకుందా మనుకొంటారు. వారి ఆశనిరాశై వింతజంతువు పుట్టేసరికి ఆ రైతుబాధ వర్ణనాతీతంగా ఉంటుంది. తల్లితో అడవికి మేతకై పోవుచున్నప్పుడు, వచ్చుచున్నప్పుడు పిల్లలు కోడె మూపురం మీదికాలును, తోకల జంటను చూసి అల్లరి చేస్తున్నప్పుడు, ఆ వింత కోడె పూర్వ జన్మలలో పడిన కష్టాలను తన తల్లికి వివరిస్తున్నప్పుడు మన హృదయాలు ద్రవించి పోతుంటాయి.

లోకం ఈసడించుకొన్నా తల్లితోడుగా ఉండేది. ఆ తల్లికూడ చనిపోయేసరికి కోడెదిగులు ఎక్కువగుతుంది. అప్పుడు

'అమ్మలేనియిల్లు నడవియై కనుపించె
కానతోచె వల్లకాడు కరణి
ఇంట నడవి రెంట నుంట సంకటమెయై
ఊరు విడిచి పోవ నూహచేసి'—

యజమానితో నేర్పడిన బంధములను త్రెంప వశము కాక కన్నుల నీరు క్రమ్ముకొనగ కట్టు విప్పుచున్న కాపును దీనంగా చూస్తుంది. ఇల్లువదలి వెళ్ళుతూ వెళ్ళుతూనే వెంటనే ఆగి వెనుకకు చూచి ఇంటివైపు అయిదారడుగులు వెళ్ళుతుంది కన్నుల నీరు నిండ మళ్ళీతిరిగి అడవివైపు ప్రయాణిస్తుంది. అక్కడ కూడ ఒకేచోట ఉండలేక ముందుకు పోలేక, ఎటూ వెళపోక అటు ఇటు పరుగెత్తుతుంది, చివరికి ఒక గంగిరెద్దులవాని చేరిలో చిక్కుతుంది. ఇట్లా కావ్యంలో గంగిరెద్దు కథంతా కరుణరస ప్రవాహంగా పరవళ్ళు త్రొక్కుతుంది.

'కర్మలను బట్టి భాగ్యముల్ గలుగునవరే' కటుతీపిగదా! కన్నతల్లి యెరికిన్; 'దక్కాముక్కల్' తినకున్న చేకూరునే లోకజ్ఞానమెవ్వారికిన్'—మున్నగు లోకోక్తులు, జాతీయాలు కావ్యంలో కోకొల్లలు, వీటి వలన కవి లోకపరిశీలనా శక్తితో పాటు కావ్య దృక్పథం చదువరుల హృదయానికి హద్దు కోవటానికి చక్కని అవకాశం ఉంటుంది.

కావ్యంలో సందర్భానుసారంగా వాడిన పొసంగము, దుడ్డె, కొట్టము, గోలెము, కంచె, గుంజ— వంటి తెలంగాణా మాండలిక పదాలు కూడ రచనలో చక్కగా కలిసిపోయి అహ్లాదాన్ని కల్గించి కవిరచనా ప్రావీణ్యాన్ని పట్టిస్తాయి.

ఆడపడచులు సంక్రాంతి బొమ్మల కొలువులో శ్రీమద్భాగవతకథలు, శ్రీకృష్ణుని లీలలు చిత్రించిన బొమ్మలతో పాటు గాంధీ, నెహ్రూ ప్రతిమలు కూడపెట్టారని వర్ణించుటలో కవికి భారతీయ సంస్కృతియందుగల అభిమానంతో పాటు వారి జాతీయ స్ఫూర్తి కూడ స్పష్టమగుచున్నది.

ఈ విధంగా తెలుగునేలయందు బహుళ ప్రచారంలోనున్న బసవన్న కథను ప్రధానంగా తీసుకొని వివిధరకాలైన వర్ణనలతో.తెలుగు ప్రజల ఆచార వ్యవహారాలతో, మృదు మధుర పదాలలో కమనీయంగా 'గంగిరెద్దు' కావ్యాన్ని తీర్చి దిద్దిన శ్రీ పల్లాదుర్గయ్య తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్మరణీయులు.

# తెలంగాణా మాండలిక భాషలో మొదటి కథా సంపుటి–కడుపుకోత

...బి. యన్. ఆచార్య

తెలుగు సాహిత్యంలో మాండలికాన్ని మొదట ప్రవేశ పెట్టింది గురజాడ అప్పారావు గారు. ఆయినా తొలిసారిగా కథలు రాసినవారు మాధవ పెద్ది గోఖలే. ఆయన కృష్ణా, గుంటూరు జనభాషను వాడుకుని కథ రాస్తే పండితులంతా వ్యతిరేకించారు. కథలోని పాత్రలు ప్రజల భాష మాట్లాడితే ఫరవా లేదు, కాని కథా రచయిత కూడా ప్రజలతో కలిసి, వారి భాషలో కథ చెప్పడాన్ని అప్పటి మేధావులు ఆక్షేపించారు.

తెలంగాణా మాండలికంలో కథా సంపుటాలు రావడం 'కడుపుకోత'–తోనే మొదలయ్యింది. కడుపుకోత రచయిత శ్రీదేవరాజు మహారాజు. ఆయన మొదటి సంపుటి మాత్రం కడుపుకోత కాదు. అంతకు ముందే తెలంగాణా ప్రజల భాషలో కవిత్వంరాసి 'గుడిసె గుండె' పేరుతో ప్రకటిం చారు. మాండలికంలో కవిత, కథచెప్పి మెప్పిం చింది, మొదటిసారిగా సంపుటాలు ప్రకటించింది ఆయనే. ఆ తరువాత చాలా మంది రచయితలు ఆయనను అనుసరించారు.

ముందుతరం రచయితల్లో వట్టికోట ఆళ్వార్ స్వామి గూడూరు సీతారాం, సురమౌళి, యశోదా రెడ్డి మొదలైన వారు తెలంగాణా జీవితాన్ని ప్రతి బింబిస్తూ ఆ భాషలో కథలు రాశారు. ఈ తరం రచయితల్లో శ్రీయుతులు, దేవరాజు మహారాజు, అల్లం రాజయ్య, పడాల. రాములు బి. ఎస్. రాములు, రఘోత్తమ రెడ్డి మొదలైన వారు ఈ కోవలో చేరుతారు.

'కడుపుకోత" (1978) కథా సంపుటిలో రెండు రకాల కథలున్నాయి. పూర్తిగా మాండలి కంలో రాసినవి కొన్ని, కథ మామూలు వ్యవహారిక భాషలో నడిచి, సంభాషణలు మాత్రం మాండలి కంలో వున్నవి కొన్ని. సంకలనంలో మొదటి కథైన కడుపుకోత ఈ విధంగా మొదలవుతుంది. కమలమ్మను దవాఖాన్ల శరీకు జేశింద్రు దానికి కడుపునొప్పి. ఇయ్యాల్లనా నిన్ననా ఎన్నొద్దు ల్నించి అగోరిస్తాంది. మంత్రాలు, తాయితలు ఎన్ని గట్టినా తక్వగాలె. ఎందరి వైద్యుల తాన మందు దిన్నా తక్వగాలె. ఆకాడికి అల్లుడు మంచోడు. నా బిడ్డ అగమ్మ పట్టొలె తల్లడిస్తుంటె కొంటా వాయి ఉస్మానియాల ఏశిండు. పెద్ద డాక్టర్లు జూశి అపరేషను జెయ్యాలన్నారు'. ఈ రకంగా కథంతా ఒక ముసలవ్వ అనుభవంలోంచి, ఆమె మాటల్లోనే సాగిపోతుంది బిడ్డ ఆపరేషను గురించి మొదటి సారిగా హాస్పిటల్ కు వచ్చిన ముసలవ్వ అక్కడి అన్యాయాల్ని అసహ్యించుకుంటుంది. ఆపరేషను థియేటర్ లోంచి బయటపడ్డ ఆమె

రిసెర్చ్ స్కాలర్, నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

కూతురు కమలమ్మ మెళ్ళో, పుస్తెలతాడు మాయమవడం ఇందులోని ఇతివృత్తం.

ఈకథలో ఇతివృత్తం కంటె శైలి గొప్పది. రచయిత ఎక్కడా కనబడకుండానే ముసలమ్మ మాటల్లో సమాజ స్వరూపాన్ని చక్కగా కళ్ళకు కట్టిస్తారు. "నాదేమో తెల్వని గోరమాయె. నాకే మేకక?" -అన్న అమాయకపు మాటవెనక హాస్పిటల్‌లో పైస పైసకు పీడించే చెడ్డ సంప్రదాయాన్ని దుయ్యబడతారు. ఆగమ్మ పక్షి, అంగరంగ వైభవంగ పెండ్లి, బిడ్డ అంబ్యాదది సర్కారి దవాఖాన, సాయబాను వంటి ఎన్నో మాటలు ఉపయోగించి ముసలవ్వ పాత్రకు జీవం పోశారు. ఇది చక్కటి జానపద వ్యక్తీకరణకు ఉదాహరణ.

వైద్య విధానం మీద నర్మ గర్భంగా దెబ్బతీసిన రచన ఇదొక్కటేకాదు. సంకలనంలోని మరికొన్ని కథలుకూడా అపని చేశాయి. కడుపుకోత కథ మహానగరంలోని ఆసుపత్రి వాతావరణం చిత్రిస్తే 'కండ్లుదెరిశిన నెత్తురు' కథ తాలూకా స్థాయిలో ప్రయివేట్ ప్రాక్టీస్ చేసుకుంటున్న ఫేక్ డాక్టర్స్ దొంగ వైద్యుల మోసాల్నే వెల్లడించింది "మంత్రం" "చీకటి పడుతుంది" కథలు గ్రామ స్థాయిలో వైద్య విధానపు స్వరూప స్వభావాల్ని తెలియ జేస్తాయి. అమాయక ప్రజలు మందుల ఖర్చులు భరించలేక మంత్రాలకు పోతే. మంత్రగాడు అంత కంటే ఎక్కువ అడుగుతాడు. వైద్యం చేసే బడి పంతులు ఫీజుగా డబ్బులు అడగడు. ఎప్పటి నుండో కన్నేసి వుంచిన సోములు భార్యను కోరుకుంటాడు. ఈ విధంగా సమాజ రుగ్మతల్ని సరైన పంథాలో డయగ్నోజ్ చేయగల కథకుడు డాక్టర్ దేవరాజు మహారాజు

ఈయనకు ప్రజా జీవితం బాగా తెలుసు. కథలకు ఎన్నుకున్న అంశాలన్నీ పాటక జనానికి సంబంధించినవే. సమాజంలోని అట్టడుగు వర్గాలను గురించి తనకున్న సానుభూతిని, కళాత్మకంగా మలిచి సజీవ చిత్రాలుగా పాఠకుల ముందుంచారు.

ప్రతి మండలానికి కొన్ని ఆచార వ్యవహారాలు ఉంటాయి. ప్రతి మండలపు పాత్రలలో ఒక ప్రత్యేకత కొట్ట వచ్చినట్టు కనిపిస్తుంది. కాబట్టి ఆ మండలపు ప్రజా జీవితాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకొని అందులో అంతర్భాగం కాని రచయిత మాండలిక రచనకు పూనుకోవడం కష్టం. పూనుకున్నా అందులో భాష వుంటుందే కాని జీవం వుండదు. మహారాజు గారికి ఆ సమస్య లేదు. ఆయన పుట్టి పెరిగిన వాతావరణం తెలంగాణం గనక ఆ భాషలోని తెలుగు నుడికారాన్ని గుండెకు తాకేంత సూటిగా చెప్పగలిగారు. ఆయనకు మాండలికం మీద ఆసక్తే కాదు. అధికారం కూడా ఉంది. "పంతులు లేత చింతకాయ పులుసోలె నగిండు"- అని అంటారు, మంత్రం కథలో. సుక్కమ్మ అట్టడుగు వర్గానికి చెందిన ఒక మామూలు స్త్రీ. పంతులు వ్యంగ్యంగా నవ్విన నవ్వును ఆమె, ఆ విధంగా కాక మరో విధంగా ఊహించు కోలేదు.

'ఆ పిల్ల కండ్ల ఊసులు... ముక్కు చీమిడి నోట్లోనుంచి సొల్లు—అంతా గలీజు!—అల్ల బత్కాలె,' అంటారు రచయిత. బాహ్యంగా కనిపించే ఆ అనారోగ్యం లోంచి అందుకు కారణమైన వారిని, వారి శ్రమ శక్తిని పీల్చి పిప్పి చేసిన దౌష్ట్య పరుల్ని చూడాలంటారు రచయిత పైపై నినాదాలతో కాకుండా జీవితపు లోతుల్లోంచి సమాజ స్వభావాన్ని వెలికితీసి చూపడం ఈ రచయిత ప్రత్యేకత. మధ్యతరగతి జీవితాన్ని, బడుగు వర్గపు

బతుకుల్ని చిత్రించిన కథా సాహిత్యం వుంది. కాని మహారాజు గారి కథల్లో—అటు బడుగు వర్గానికి చెందక, ఇటు మధ్యతరగతికి ఎదగక కొట్టుమిట్టాడుతున్న దీన జనుల ఆవేదనలు ఆక్రందనలు కని పిస్తాయి. 'కండ్లు దెరిశిన నెత్తురు' కథను చాలా విశితంగా పరిశీలిస్తే ఆ విషయం తెలుస్తుంది.

"పాతగోడ'— చాటున పెత్తనం చలాయించే దొరలు. కూలీల మధ్య తగాదాలు సృష్టించి వాళ్ళు కొట్టుకుంటూ వుంటే చూసి ఆనందించే పెత్తందార్ల ప్రాణం పోతుందన్నా వినిపించుకోక తమకారు మురికి అవుతుందని వెళ్ళిపోయే రాజకీయనాయకులు కూడా ఉన్నారు. ఈకథల్లో.

'కోళ్ళపందెం' కథలో దొరలు తమ రైతు కూలీలను కోళ్ళుగా భావించి, వారి మధ్య పోటీపెట్టి ఆనందించడం జరుగుతుంది. కోళ్ళతో ఆడుకునేది సంవత్సరానికి ఒక్కసారయితే వీరితో సంవత్సరం పొడుగునా ఆడుకోవచ్చని రచయిత సెటైర్. ఊరి సర్పంచు, కరణం రాజకీయాల మధ్యగ్రామం లోని మామూలు పేదజనం ఎలా నశించి పోతున్నారనేది వర్ణించబడింది.

నిజాం నీడలో, గ్రామాల్లో సాగినభూస్వాముల ఆగడాలు మనకు చిల్లర దేవుళ్ళు వంటి నవలల్లో కనిపిస్తాయి. నిజాం పరిపాలన అంతమైపోయి, స్వాతంత్ర్యం లభించిన తర్వాత కూడా పల్లెలలో పెత్తందారుల జులుం పూర్తిగా నశించిపోలేదు. వెనకటిలా దొరలమని విర్రవీగలేరు. అట్లని మామూలు ప్రజలతో కలిసిపోనూ లేరు. అలాంటి క్లిష్ట పరిస్థితిని 'పాతగోడ' కథలో ఈ రచయిత వర్ణించారు.

దొరబంగళాకు, ఇతర గ్రామస్తుల ఇళ్ళకు మధ్య ఎత్తుగా నిలబడివున్న గడిగోడ కూలిపోవడం 'పాతగోడ' కథలోని ఇతివృత్తం. దొరతనం కూలిపోయిందన్న అర్థం స్ఫురించేలా రాయబడ్డ ఈ కథలో—గ్రామస్థులు రాత్రికి రాత్రే వర్షానికి తడిసి వున్న గడిగోడను గడీలోకి పడగొడతారు. అంటే దొరతనాన్ని పడగొట్టారని అర్థం!

జానపద వ్యక్తీకరణ గొప్పగావున్న మరొక కథ 'యెలుగు మింగిన శీకటి' ఇందులో ప్రమాద వశాత్తు గుడిసెలు కాలిపోతే, గ్రామంలోని పటేలు ఇండ్లు కాలిన వారి దగ్గర చందాలు వసూలు చేసి పోలీసు వారికి మామూళ్ళు ఇవ్వదలచుకుంటాడు.

సంకలనం మొత్తంలో ప్రత్యేకమైన కథ 'మూగమోసం' కథంతా రైలుపెట్టెలో నడుస్తుంది. రైలు క్యారేజి సమాజానికి సంక్షిప్త స్వరూపం. సమాజంలో మోసం చెయ్యనిది ఎవరు? అందరూ ఎవరినో ఒక్కరిని ఏదో ఒక రకంగా మోసంచేస్తున్న వారే. జరుగుతున్న మోసాల్ని చూసి తమకు పట్ట నట్టు వూరుకున్న వారుకూడా ఒక రకంగా మోసగాళ్ళే. రచయితగా దేవరాజు మహారాజుగారు మాత్రం మోసం చెయ్యరు. కళ్ళెదుట వున్న సమాజంలోని అవకతవకల్ని ఆయన తనదైన పద్ధతిలో కళాత్మకంగా చెప్పారు. కవిత్వంరాయడం వల్ల కాబోలు వివరంగా చెప్పవలసిన చోట కూడా సంక్షిప్తంగా చెప్పారు. అందుకే ఆయన కథలన్నీ అతిచిన్నవి. పాఠకుల్ని ఆలోచింపజేసే ఈ కథలు సజీవ సమాజ చిత్రాలు.

# 'కవినాథులు' తంయాల లక్ష్మీనృసింహాచార్యులవారి కుబ్జాకృష్ణ విలాసం–ఒక స్మరణిక

పోతూరి రఘురామయ్య

అచ్చతెనుగు కుబ్జాకృష్ణవిలాసము కావ్యం, నల్లంతిఘళ్ చక్రవర్తుల తంయాల లక్ష్మీనృసింహాచార్యుల వారు వ్రాసిన శుద్ధాంధ్ర ప్రబంధము. 1908నాటికే కవి ఈ రచనను పూర్తిచేశారు. 1932లో ఇది అచ్చు అయింది. కావ్యము షష్ఠి పూర్తిచేసుకొన్నదనుకోవచ్చును.

ఓరుగల్లు నివాసియగు తంయాల నృసింహాచార్యులవారు 1884లో జన్మించినారు. వీరి తల్లిదండ్రులు రంగాచార్య, వేంకటాంబగార్లు శ్రీమాన్ దతూరి లక్ష్మణాచార్యుల వద్ద వీరు సంస్కృతాంధ్ర సాహిత్యములలో చక్కని పరిచయాన్ని పొందినారు. శ్రీమాన్ మరింగంటి లక్ష్మణదేశికుల వద్ద వీరు వైష్ణవసాంప్రదాయికమైన తమిళ గ్రంథాలను అధ్యయనం చేసినారు. శ్రీ వేల్పుకొండ లక్ష్మీ నృసింహస్వామి (జఫర్‌గఢ్ ఓరుగల్లు సమీపమున) వీరి కులదైవము ఆస్వామి వారికే వీరి కృతులలో ఎక్కువ గ్రంథాల్ని అంకితం చేసినారు. హేమాంగీవిలాసం నేరేడువల్లి శ్రీ వేంకటేశ్వరస్వామికి అంకితం చేశారు. దాదాపు మిగతావన్నీ శ్రీవేల్పుగొండ నృసింహస్వామి వారికే అంకితమొనర్చినారు. ఈ కవి ఏ గ్రంథమునూ నరాంకితం చెయ్యలేదు. ఆవిషయంలో పోతనకే మనవాటన్నవాడు. ఈ కవి స్వయం కృషితో రచనా ప్రావీణ్యము నొందినాడు. అంతేకాదు చతుర్విధ రచననూ సాధనచేసి విజయం పొందాడు. గోలకొండ కవుల సంచికలో సురవరం ప్రతాపరెడ్డిగారు నవ్యాంధ్ర సాహిత్య వీధులలో కురుగంటి సీతారామయ్యగారు వీరి రచనా ప్రశస్తిని ఉట్టంకించినట్లు తెలుస్తున్నది. విశ్వనాథ వారు కూడా 1950లో అచ్చయిన శ్రీ వేల్పుగొండ క్షేత్రమాహాత్మ్యమును చదివి ఆశ్చర్య చకితులైనట్లు తెలుస్తున్నది.

తెలుగు సాహిత్య ప్రపంచంలో ముఖ్యంగా అచ్చ తెలుగు కావ్యాల్లో, ప్రబంధాలలోనే కుబ్జను గురించి వ్రాసినవి మృగ్యమే. అందే ఇది అపూర్వ రచనగా గుర్తించవీలున్నది.

కుబ్జా పూర్వజన్మ వృత్తాంతము, పరిశీలించినచో ఆమె రావణుని చెల్లెలగు శూర్పణఖ ఆమె శ్రీరామచంద్రుని మోహించి అతని ప్రేమకై వేచుకొన్నది. సీతను మ్రింగబోగా లక్ష్మణుడు ముక్కు చెవులు కోశాడు. విఫలమనోరథయైన ఆమె రావణుని ఈ విషయం చెప్పి దుఃఖించి అతనికై తపస్సుచేసి పునర్జన్మమున కుబ్జయైనది.

సహకార కళాశాల, రుద్రంగి–505 307, జిల్లా కరీంనగర్.

కుబ్జ ఒకరోజున కంసునికి సుగంధ ద్రవ్యములను తీసుకొని వెళ్ళుచుండగా శ్రీకృష్ణ, బలరాముల దర్శనమామెకు కలిగినది. కుబ్జ అతనికి సుగంధ ద్రవ్యములను పూసినది. శ్రీకృష్ణుడు ఆమె గూనిని పోగొట్టినాడు. సుందరమైన స్త్రీగా మారి శ్రీకృష్ణునే వరించి కృష్ణునితో ప్రేమను పొందినది. ఇదీ కథా సంగ్రహం మూడు ఆశ్వాసములలో సాగిన ఈ కావ్యం ఓరుగల్లు మాండలిక భాషా పరిశీలనకూ ఆధార గ్రంథముగా ఉపయుక్తమవుతుందనవచ్చు. దీనికి ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు పీఠిక వ్రాయటం విశేషాంశముగా చెప్పుకొనవచ్చును.

కవి వ్రాసిన ద్విరదగతిరగడ ఒకటి ఉదాహరకు మాత్రము.

కలికితోట, సింగారముల గారముల
పొలతులకు జల్లుగం బూరలను బూరలను
దట్టించి యెక్కు విరితావులను తావులను
కూటువుగ దూకుమనె కొమ్మలను కొమ్మలను
నీటుగా దెమ్మదానిమ్మలను విమ్మలను

— — — —

ఇలా చాలా చక్కని రీతిలో ఈ రగడ సాగింది.

శుద్ధాంధ్ర గద్యరచనలోనూ కవి సాటిలేని ప్రజ్ఞ చూపినాడు. ద్వితీయాశ్వాసంలో

"వ. ఇట్లాజోటిమేటి బోటి కత్తియల కూటువల కూటమితో యాట తోటల జేరి చెఱకు విలుతు దొర బెట్టిన నిగనిగ మెఱుగులీను విఱికఱుకుటమ్ముల నెఱి మీఱి నత్తెఱవ కరకరంబి చూపులనెల్ల దెసల బరికించుచు కమ్మని తమ్ముల కమ్మనీరు నెమ్మిని దిమ్ముదీర గ్రావి ముమ్మరమ్ము మమ్మరించ జుమ్ము జుమ్మన రొదాళమ్ములు సేయు తుమ్మెదల మొత్తమ్ముల కొమ్మల ముంగురుల లొట్టుమ్మడిం గని తమ కొమ్మలమ్మని లేచి ద్రిమ్మరిల్లుచున్న గఱుల చాటులఁజూచి ......

ఈ విధంగా సాగింది వచనం—

ఒక ఉత్పలమాలలో '...చెవు లపోతులు మిక్కిలి వేడి యెండచే దూపిలి కాలునాకె' అన్న విషయం కవి యొక్క లోకపరిశీలనా నైపుణ్యానికి తార్కాణ. పద్యః స్ఫూర్తికి 'దుస్సలు నీటిబిడారు పంకిలో తేపతేపకుబొరలె' అన్నది ఉదాహరణ—

చంపకాది పద్యములేగాక కరిబృంహితము, కలహంసోత్సాహవృత్తం, తరళము మొదలైన విశేషవృత్తాలనూ వాడినాడు చతుర్విధ కందగర్భ ప్రమితాక్షరవృత్తము, మత్స్య బంధము, ఖడ్గబంధం, కూర్మబంధము కుండలీబంధము—మొదలైనవి ప్రశస్తమైన సాధనా ఫలములుగా చెప్పుకోవచ్చు. దండకరచన కూడా శుద్ధాంధ్రములో చేయుట కష్టసాధ్యము. కవి దానిని సాధించాడు. 'సీరామ వేల్పా బయల్పెఱెలం బమ్మ ముక్కంటి యుం దగ్గి జక్కుల్మొదల్గా జగంబంత నిన్నెన్నగా జాలరే...' అంటూ ఆరంభమైన దండకంలో దశావతార వర్ణన, భగవద్వైభవము వివరించి శరణాగతి ఆవశ్యకతను ధ్వనింప జేసినారు..

ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు పేర్కొన్నట్లుగా (1932—నవంబర్ 28) 'ఈ కాలమున నచ్చ తెనుగు ప్రబంధముల రచించు వారలే యరుదుగా గన్పట్టిని, అందున నీ యాచార్యులు మిక్కిలి శ్రమపడి ఇట్టి యుత్తమ గ్రంథమును నచ్చ తెనుగున రచించి, యాంధ్ర భాషా వధూటీ పాద పద్మముల నొక సువర్ణాభరణము నొసంగి యమూల్య సేవఁజేసి నందుల కాంధ్ర మహాజనుల కెల్లరకు శ్లాఘనీయులు'' ఈ కావ్యము సువర్ణాభరణమే యగుచున్నది. ఇట్టి దివ్యాభరణమును వెలుగులోనికి చేయూతనిచ్చి సహకరించిన వారు వైశ్యశ్రేష్ఠులగు కటకం నరసయ్య, వీరన్న గార్లు జీవితాంతం ఎవరికీ చేయి చాచకుండా బ్రతుకగల్గి, దైవాశ్రయంగా కావ్యరచన చేస్తూ వచ్చిన ఆచార్యులు ధన్యజీవులు. వీరి రచనలు ఇరవై దాకా అప్రచురితములే. కేవలమునాలుగే ప్రచురితగ్రంథాలు.

# నిశాంతం ఒక మధుర కావ్యం

వై. నాగయ్య

ఆర్.యస్. సుదర్శనంగారు రచించిన నిశాంతం చక్కని మధురకావ్యం. ఇది కవి రచించిన ఇరువది నాల్గు కవితల సంపుటి అనుభూతి పరమైన ధ్యాన కవిత. ఈ అనుభూతి ప్రతీకల ద్వారా అభివ్యక్తం చేయబడుతుంది. ఎపుడో నా యెద బూచెను/జపమై కవిత్వసాధన, ఆహా/లిపుడే మాలికగావ/చ్చి పరిణత యశస్వి కంఠసీమను నిల్చెన్' అని కవియే స్వయంగా కావ్య సమర్పణం లో చెప్పుకొంటాడు. ఈ కావ్యం విశ్వనాథ సత్యనారాయణగారికి అంకితమివ్వబడింది. గుంటూరు శేషేంద్రశర్మగారు అచ్చువేయించి కావ్య విశిష్టతను తెలుపుచు చక్కని పీఠికను కూడ సమకూర్చాడు.

మనిషి వరకు ప్రాణిపొందిన క్రమపరిణామ మంతా, అనగా సృష్టి చేసిన యాత్రంతా మనిషిలో పునరావృతమై ఉంది. అట్లాగే కాలంకూడా మనిషిలో పునరావృత్తమై ఉంది. సృష్టియొక్క జీవయాత్ర భౌతిక రూప పరిణామం అయితే, సర్వకాల పునరావృత్తి మనిషిలో ఉన్న చైతన్యం ఒకటి భౌతికం మరొకటి బౌద్ధికం. ఈ రెండూ అవినాభావ సంబంధంతో రెండూ వెలుగు నీడల్లా రాత్రి దివాల్లా ఒకదానివెంట ఒకటి పరుగిడుతూ ఉంటాయి.

మానవ చైతన్యం ఒకనాటి ఉపలబ్ధికాదు. యుగయుగాలనుంచీ పిపీలికాది బ్రహ్మపర్యంతం క్రమ పరిణామంచేత రూపొందింది. ఈ చైతన్య పరిణామ దశలన్నీ మనిషిలో నంక్షిప్తమైఉన్నాయి. వీటినే తత్వశాస్త్రం పంచకోశాలుగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశాలుగా విభజించింది. ఈ విభజనలో సృష్టియొక్క సమస్త జీవజాలంలో ఉన్నచైతన్య తరతమ దశలన్నీ ఇమిడి ఉన్నాయి. ఈ చైతన్యం యుగ యుగాలనుంచీ సమాహార స్వరూపం ఈచైతన్యం కాలపు రూపాంతరం అంటే కాలమేనన్నమాట. ఇదే అంతర్నిహితసర్పం, కాలసర్పం- ఇన్ని యుగాల నుంచీ పరిణామం పొందుతున్న ప్రయాణం చేస్తున్నజీవం, జీవుడు ఈపొరల్లో, కోశాల్లో చిక్కుకుని బంధమోక్షంకోసం ఏడుస్తున్నాడు. ఆ ఆర్తే నిశాంతం.

ఇందులో జీవేశ్వరులు, ప్రేయసీ ప్రియులు, ప్రకృతి పురుషులు, యోగం, వేదాంతం, ఉపాసన ఎన్ని ఉన్నాయో, అన్నీ ఉన్నాయి. అన్నీ మేఘపరంపర సంక్రమణ శిల్పంలా ఒక దానిమీద ఒకటి ఖేలలాడుతుంటాయి. ఏవీ స్పష్టంగా ఉండవు కానీ ఏదో ఒక మధువును ఆంతరిక జిహ్వ అనుభవిస్తూంటుంది. అంతే-ఆ మధురిమ స్పష్టంగా

ఇంటి నెం: 6-99, మడికొండ-506 142

ప్పడం చేత వచ్చింది కాదు అనేది మాత్రం స్పష్టం.

'నిశాంతం' కావ్యంలో మొత్తం ఇరువది ఖండ్లు కవితా ఖండికలు ఉన్నాయి ఇవి వేరు వేరు పేర్లతో నున్నా అన్నింటికి అంతస్సూత్రంగా ఏకత్వత గోచరిస్తుంది. ఇందులో జీవుడి మోక్షప్రస్థానంలోని ఒక్కొ-దశను ఉత్తరోత్తర క్రమంగా వర్ణింపబడుతుంది. 'బంధితుడు' అనే శీర్షికనుంచి జారిన స్వప్నము' వరకు బంధవిముక్తి కోసం జీవుడు పడే వేదన వర్ణింపబడింది. ప్రకృతి పూజలో మాయావరణ నివృత్తికి మాయా రూపిణి అయిన పరాశక్తి కృప అవసరం అనే తద్భావ్య నిర్దేశం జరిగింది. "జన్మలు"లో కుండలిని 'ఆదర్శ జ్యోతి'లో పరాశక్తి త్రిదశలు కుమారీ మోహిత్ పతివ్రతా అనేవి సూచింపబడ్డాయి. సంఘములో ఉపాసకుడు చిత్త విక్షేపం చేత యోగ భ్రష్టుడు కావడం ధ్వనిస్తుంది.

మానసిక విశ్రాంతికై దూరంగా పోవాలని కోరుకునే కవి మనసు సమాజ సంకెళ్ళను విదిలించు కోలేక పడే తపనను 'బంధితుడు' అనే కవితలో అనేదనగా—

బాహ్య నేత్రముల కెదురై పథమునిండి
చిత్రవర్ణ విన్యాసమ్ము చేసి బ్రదుకు
సర్వమును లోగొనెడు కాలసర్పమొండు—
ఛాయయై వెంబడించి విశ్రాంతి లేని
చోదకత్వము వహియించు స్ఫూర్తియొండు—
సూత్రమైలాగు తార్కిక సూక్ష్మయుక్తి
గోచరము కాని హృదయ నిగూఢశక్తి
ముందువెనుకలై నన్ను గొంపోవుచుండె

—అని వెలిబుచ్చుతాడు.

కవి మనస్సు మాయాబంధనములతో తనను బంధించుట భావనము కాదని, స్వేచ్ఛగా జీవించే అవకాశం కావాలని, గత జన్మ స్మృతులనెడు కాగడాలు దోబూచు లాడెడు ఖేలనమని, దివ్వెల మువ్వెలవో కదంబగా చీకట్లో కొట్టుమిట్టాడే మనస్సు చలిస్తుంది కాని, తృప్తి, ఆనందం మాత్రం పొందటంలేదని భావిస్తుంది.

ఇటువంటి మానసిక వ్యధనుండి, లౌకిక బంధాల నుండి దూరంచేసి, కవి తన హృదయాన్ని ఆనందమయ లోకాలకు చేరువ చేయాలనుకుంటాడు. అందుకు ప్రణయమూర్తిగా భావించే తన భార్యను ఆలంబనముగా చేసుకొని ప్రయాణిస్తుంటాడు. ఇక్కడి కవితలు విశ్వనాథ సత్యనారాయణగారి గిరికుమారుని ప్రేమగీతాలు, నాయని సుబ్బారావు గారి సౌభద్రుని ప్రణయ యాత్రను గుర్తుకు తెస్తుంది. ఈ కావ్యాల్లోని కులపాలికా ప్రణయ భావమే సుదర్శనంగారి కవితల్లోను వెల్లడి అవు తుంటుంది.

ఆనంద సమయంలో మనస్సు సిగ్గుతో ప్రణయ మూర్తిని చేర ప్రయత్నమే చేయదు. విమర్శ చేసుకొని, సన్నిధి చేరాలనుకునేసరికి కాలాతీతమై ఒదిగిపోయే స్థితికి చేరుకుంటుంది. అప్పటి మనస్సుడోలాందోళన స్థితిని 'ఊయెల'లో—

నీ దృగంచల లాలి వెలుగు నీడలవును
పవలు రేయి, మొదలు తుదలవును నాకు
ఉభయ సంధ్యల మధ్య నిట్లూగుచున్న
బ్రదుకు టూయెల, దీనికి స్వాస్థ్యమెట్లో

అని వర్ణిస్తాడు. అప్పుడు. ఒదిగి ఉన్నటు వంటి పారు సృష్టి తొలి సంజ విచ్చు పూరేకులై నిద్రలో జారి దూరమైతారు. తర్వాత పరస్పరా న్వేషణంలో ఒకరిని నొకరు పోల్చుకో లేని స్థితికి చేరుకుంటారు.

సంధ్యా సమయంలోని పరిస్థితిని స్త్రీ మన స్తత్వంలో రూపిస్తూ 'సంధ్య' అనే కవితను వ్రాస్తాడు ఎఱ్ఱని చెక్కిలితో వెన్నెల నవ్వులతో కనిపించిన ఆమె మోమువంటి మోనమే ప్రేమ వాచకముగా నిల్చుంటుంది.

ఈ ప్రశాంత పరిస్థితిని చూస్తున్నటు వంటివ్యక్తికి నిశ్చలత్వము, తృప్తి లేకుండా భీకరశబ్దంలో వాగర్థఫలమును వాంచిస్తున్నాడు. మౌనదేవతా ప్రణయాన్నే చూస్తూకూడా, మరపుతో కదలి అనిశ్చలత్వముతో సుడుసుడులుగా లేస్తుంది ఇక్కడ—

'ఏల వనితా హృదయ భావమెపుడు శ్లేష
యై నిగూఢమై వ్యక్తమవ్యక్తమగుట
ఏల వలపు నిండిన వాని యెడద ఆశ
పరువులిడి జాను—కాదు—రంగమగుట
సిగ్గు మాయావ కుంఠిన శ్రీవిలాస
మట్లె ద్వంద్వ సంస్థితమైన జగము కాంత
జలధి వినువీధి గలియు నాకాంతమందె
అహ మిదమ్మను రెండు నద్వైతమౌను'

—అని చెప్పిన కవితా పంక్తులు ఎంతో రసమయమైనవి. ఈ విధంగా సందిగ్ధమనస్కుడైన కవి కన్నులముందు ప్రకృతి నారీమణి ప్రత్యక్షమై అతని అంతరంగాన్ని మేల్కొలిపి ఆలోచింప చేస్తుంది.

అప్పుడు ప్రకృతికి—

'ఆత్మకపురంపుటారతియై జ్వలించు
నిన్ను ప్రేమించి భ్రమియించి నృత్యమాడె
బ్రతుకనెడు నారికేళమ్ము వ్రక్కలగుచు
వలపువెల్లువ పాతె నీపదములంటి'.

—అని కైమోడ్చి కఠిన తరమైన పూజతో కూడిన వ్రతమును పూర్తిగా ఆచరించినప్పటికి జన్మరహస్యముగాని, సహనశక్తిగాని ఒంటబట్టక, తీవ్రమైన నాఆశ కొడిగట్టిన దీపమగుచున్నది. మాయతో బంధింపబడి, స్వేచ్ఛా సౌందర్యములు లేని నాకు మృత్యువే గత్యంతరంగాతోచుచున్నదని విన్నవించుకుంటాడు, అంతలోనే పూర్వవాసనల ప్రభావంతో ప్రకృతి రమణి స్వప్నమయంగా మారి దూరమవుతుంది,

జారిన స్వప్నాన్ని—

'నీడలు నీడలై సొగసు
నేర్చిన కన్నియకంటి తళ్కులై
జాడలు జాడలై మరపు
దాలుల దున్నిన సాద కోర్కెలై
ఊడలు ఊడలై మొదటి
కోడక మళ్ళిన కొత్త ఊహలై
పీడిన పీడకుండ నను
వెక్కస పెట్టెడు పూర్వ వాసనల్
రుద్దము నిశా ప్రశాంత సరోవరగత
చంద్ర బింబము నాయాత్మ, జాముగడచె
తెల్లవారుచు నుండె, విదీర్ఘ తటిని
స్వప్న మొక్కటి నక్కయై జారి పడుచు

అని వర్ణిస్తాడు. నిత్యమైన ఆత్మ పూర్వ జన్మల సంస్కార ఫలితంగా ఒక జన్మ దాలించిన తర్వాత మరొక జన్మ పొందుతుందని సంప్రదాయంలో చెప్పబడుతుంది. కాల గమనం ఎవ్వరి కొరకు ఆగదు. అయితే కాలాన్ని సర్పంలాగా భావించి, వేదాంత సారాన్ని 'జన్మలు' అనే ఒకే ఒక పద్యంలో సుదర్శనంగారు ఎంతో అద్భుతంగా ఇట్లా వర్ణిస్తాడు.

'ఎన్ని జన్మలు! పూవుతో నెన్ని రేకు
లెన్ని మధుర వాసనలు, నా హృదయమందె

యుగ యుగమ్ముల కాలమ్ము నొదిగి
యొదిగి
పుచ్ఛమును మ్రింగ బోవు పాము వలె నుండు.

కవి ఆదర్శ జ్యోత్స్న ఉన్నతమైంది. ఆమె వేదవతి.ప్రకృతి మయము. ఆమె కన్యాత్వమును దీక్షగా చేపట్టింది. ఆత్మ వీణనూ ఊహాగానముగా నందుకొను ఆమె రాగమునకు అంబరము స్థాయి. యౌవన దశలో జీవితా ధర్మ సిద్ధిగా చేసే ఆమెనే ప్రణయ సము దాన్ని చిలికి నప్పుడు ఆత్మయందు లక్ష్మిగా, సీతగా నిలబడుతుంది

అహంత చాలా పెద్దది. ఇది వ్యక్తి కోర్కెలు ఈ దేరి కట్టు కొన్న గూడుకాదు నిరాశా నిస్పృహలు ఆవృతిగా నిల్పి అనుభూతులను ఆవరించిన ఏర్పడి ఆత్మ పాలిటి రాహువు. ఇది మంచిని అసహ్యించు కొంటుంది. అన్నీ తనకే కావాలని ఆరాట పడుతుంది. ఇది నీరసించిన ఆత్మ తాపం. సత్తువలె కన్పించు అసత్తు, అయితే కవి ఈ అచేతనను అధిగమించి వ్యక్తి ఉన్నతుడు కావడానికి ప్రయత్నించాలంటాడు.

తన భావనలను వెల్లడించడానికి పురాణ ప్రసిద్ధ పాత్రలను ఎంతో చక్కగా రచనల్లో మేళవించి కవి చమత్కారములను చేసినాడు. పాపము చేసిన ఒక వ్యక్తిలో ఆలోచన మొద లయింది. అతడు సంస్కారాన్నే పొంది మోక్షాన్ని చేరుతాడు. ఈ భావాన్ని—

'ఇంద్రుని యకృత్యము నహల్య ఏడ్పుమౌని
శాపమును జానకీపతి స్పర్శ—వీని
అంతరార్థము స్ఫురించి నంతదెలిసె
ఆత్మ జిజ్ఞాసకు పునాది అఘమటంచు'

-అని వర్ణిస్తాడు.

స్త్రీ మనస్సును బాధించిన విషయాన్ని వివరిస్తూ—

'లంక గాల్చు మేధాశక్తి, రామభక్తి
గడిగి సీతమ్మ యవవాదు కాయలేదు
దక్ష యజ్ఞమ్ముతో హృది దహనమయ్యె
మిగిలినది వట్టి బూడిద, వగిలె ధాత్రిః'

—అని అంటాడు.

''వర్షము" ఇది చక్కని ప్రకృతి వర్ణన. ఇందులో కిరాతార్జునీయ కథ స్ఫురిస్తుంది. శివుడు బోయవాడు. వేటకాడు మబ్బుల తోడి యాకాశ మడవి మెఱపు శివుడు విసిరిన శూలము మేఘము అడవి పంది. ఇట్లుండగా ప్రణయ వర్షం కురిసింది తనలోని అహంత జారిపోతుంది.

తన అన్వేషణకు ఆధారమైన భార్య, కవికి జ్ఞానోదయం కల్గించుట ద్వారా ఇంద్ర పదవిని పొందింపచేస్తుంది. అప్పుడు ఇంత వరకు అయో మయంలో పడవేసిన చీకటి వెలుగవుతుంది. అతనిలో

చీకటి వెలుగై, కృష్ణుడు
నా కన్నుల కాంతియై, క్షణమ్మవ్యయమై
లోకము నాలో పుష్ప
మ్మై, కమనీయ ప్రభాతమై రమెయించెన్.

ఆ సమయంలో 'నీవు నాలోనెయున్నావని తెలియుటకు

పట్టెనిన్నాళ్ళు నామనోభ్రాంతిపీడె
జ్ఞాననేత్రము దెరచు ప్రకాశలవము
దోచె, దుఃఖజీమూతమ్ము తొలగిపోయె'

—అని కవి నవర్తువు పాడుతాడు.

ఈ విధంగా ఆర్.యస్.సుదర్శనంగారు భౌతికమైన మాయాబంధనములతో చిక్కుకొని ఉన్న సమయంలో, పవిత్రమూర్తిగా భావించిన తన భార్య ఆలంబనముగా నిత్యావలోకనం సాగించి ప్రకృతిని దైవంగా భావించి అహంతను అధిగమించి, అద్వైతాన్ని పొందుట గమనించవచ్చు

'పదములన్నియు రూపకాలంకారముల దీపములు. ఒక శివుడు ఒక సత్యభామ, ఒక రాముడు. ఒక శకుంతల పురాణములయందలి బహుకథలు, ఊర్వశి అన్నియు వ్యాఖ్యాన గర్భితోములై ప్రపంచ రహస్యముల జెప్పును. సృష్టి మర్మములను విడవబచును. ఇతని ప్రణయమునందు ప్రతిఫలించును. వ్యాఖ్యాతము ఒగును. దాంపత్య ధర్మమునుండి స్వర్గలోకమును చేరుటయెట్లో, పరమేశ్వరుని సన్నిధానమును చెందుట యెట్లో బోధించును.' అని విశ్వనాథ సత్యనారాయణగారు అంటారు. 'తెలుగులో ఇలాంటి కవిత్వంగానీ, కావ్యంగానీ లేదు. ఇది గట్టిగా చెప్ప వలసిన విషయము. కనుక ఈకావ్యకర్త తెలుగు కవితారంగంలో ఒక విశిష్ట స్థానం ఉంది. ఈ కావ్యపు బహిరంతః స్వరూపాలు నిగూఢములు కేవలం కావ్య శరీరంగా చూస్తే బహిఃశరీరమంతా ప్రతీకలు బింబాలు, అలంకారాలు బనవాటిచేత నిర్మింపబడింది. అంటే వ్యంగ్య శరీరమేగానిబాహ్య శరీరంలేదు. ఇక అంతఃస్వరూపం చూస్తే అనుభవైకవేద్యం. జీవాత్మయొక్క వేదనకుండలి న్యుస్థాపన. సహస్రారాంతర్గత చంద్రమండలవేధ, అమృత వర్షము శివశక్త్యైక్యము. మోక్షసుఖము. ఇదికావ్యవృత్తం' అని గుంటూరు శేషేంద్రశర్మ గారు చెప్పినారు. వీరిరువురి మాటలు ఈకావ్య విశిష్టతను చక్కగా వెల్లడిస్తున్నాయి. సుదర్శనం గారే ఒకచోట పేర్కొనినట్లు నిశాంతం, హృదయ మధురార్తిమయమైన చక్కని కావ్యం.

# ఆర్తి గీతాలలో చల్లా హృదయం

డా. పోన్నా లీలావతమ్మ

హృదయం భౌతికంగా మానవులకందరికీ ఉంటుంది. కానీ అందరినీ హృదయం వున్నవారిని, సహృదయులని అనము. సాటి జీవులను, మానవులను శారీరకంగా గానీ, మానసికంగానీ హింసించని మానవతా మూర్తులను, ఎదుటివారి బాధలను తమ బాధలుగా భావించి అర్థం చేసుకొని తోడ్పడే దయామయులను, త్యాగనిరతులను హృదయం వున్నవారని, సహృదయులని అంటాము. ఇలాంటి సహృదయులు ఈ కలికాలంలో చాలా అరుదు. ఈ అరుదైన మహనీయులలో ఆచార్య చల్లా వారొకరు. వీరి పూర్తిపేరు చల్లా రాధా కృష్ణశర్మ గారు. వీరు మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఆచార్యులుగా పనిచేసి, పదవీ విరమణ చేసి, తిరిగి తమ ప్రతిభా పాండిత్యాలవల్ల, పేరు పెంపులవల్ల భారత దేశంలోనే జాతీయాచార్యులుగా నియమించబడిన మహామనీషి.

రాజమహేంద్రవర ప్రాంగణంలోని తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్యపీఠంలో వారు తమిళ సాహిత్యంపై ఉపన్యసించినప్పుడు వారి గుండె లోతు నుండి సత్యం, మానవత, దయ, ఆవేదన, ఆత్మీయత, నిజాయితీ మొదలైన భావ రత్నాలు పెల్లుబికాయి. సత్యం మరుగున పడిపోయి అసత్యం ప్రకటితమై ప్రచారమవుతున్నందుకు, కష్టపడేది ఒకరైతే సుఖాన్ని అనుభవించేది వేరొకరవుతున్నందుకు చల్లా వారు ఎంతో ఆవేదన వ్యక్తం చేశారు. ఇలా ఇతరులకోసమై తమ ఆవేదన వ్యక్తంచేసే దయామయులు నిజంగా మాధవాంశ సంభూతులని చెప్పవచ్చు.

చల్లా రాధాకృష్ణశర్మగారు ఉపన్యాసరీత్యా ఆంధ్ర, తమిళ, ఆంగ్లభాషాసాహిత్యాలలో అవిరళ కృషిచేసి అనేక ప్రక్రియలలో అర్థశతాధికంగా రచనలు చేశారు. వీరు జగమెరిగిన రచయితగా ప్రఖ్యాతిగాంచారు. తెలుగువిందు, వ్యాసమంజూష, మదరాసు తెలుగు, వేమన సూక్తులు మొదలైన వ్యాసాలు; దళవాయి రామప్పయ్య, రాణిమీనాక్షి మొదలైన నవలలు; జయించిన జనత, ఆర్తిగీతాలు, శ్రమలోస్వర్గం, శాంతిసూక్తం మొదలైన కవితలు, సి. పి. బ్రౌన్ సాహితీసేవపై విమర్శ, 'ఆడపిల్ల తండ్రిని' అనే కథానిక, శ్రీవిజయం, రాజభక్తి అనే నాటికలు, సాయినాథ శతకం, చరిత్రకెక్కిన చరితార్థులు, చందమామ, వానకురిసింది మొదలైన పిల్లల గేయాలు, అనగనగా, దయావీరులు మొదలైన పిల్లల కథలు; మణి మంజీరము, తమిళ వేదము, తమిళ పంచ కావ్య కథ, తమిళ సాహిత్య చరిత్ర, సుబ్రహ్మణ్య భారతి, తెలుగు—దాక్షిణాత్య సాహిత్యాలు, ఆధునిక తమిళ సాహిత్యం నిర్మాతలు, ఆర్కాటు సోదరులు

తెలుగు విశ్వ విద్యాలయం, బొమ్మూరు- 533 124, తూర్పుగోదావరి జిల్లా. (ఆం.ప్ర.)

గరిమెళ్ళ సాహిత్యం మొదలైన జీవిత చరిత్రలు, ఆత్మచింతనము, తిరుక్కురళ్ (తమిళ వేదం) తమిళ కథానికలు, చిట్టికి చిరుగంట, దారి చూపిన బాపు గాంధి, మా తాతయ్య కొక ఏనుగుండేది. అనకత శయసం మొదలైన తమిళంలో నుంచి తెలుగులోకి చేసిన అనువాద గ్రంథాలు, ఆయిరం తలైనాగం, తెలుగు ఇలక్కియప్పల కణి అనే తమిళ వ్యాసాలు. 'ది రామాయణ ఇన్ తెలుగు అండ్ తమిళ్ ఎస్టడీ, లాండ్ మార్క్స్ ఇన్ తెలుగు లిటరేచర్, టేల్స్ ఫ్రమ్ తెలుగు, రాంబ్లిగ్స్ ఇన్ తెలుగు లిటరేచర్, పాల్కురికి సోమనాథ అనే ఆంగ్ల గ్రంధాలు మొదలైన రచనలు చేశారు.

చల్లావారి కవితంలోని ఆర్తి గీతాలకు పీఠిక వ్రాసిన వీరి మిత్రులు శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు వీరి సాహితీ కృషిని గూర్చి—''పండితుడుగా, పరిశోధకుడుగా, తమిళాంధ్ర సారస్వతాల మధ్య సాంస్కృతిక సేతువుగా, సాహిత్య అకాడమీ కార్యకర్తగానే ప్రధానంగా ప్రసిద్ధులైనా కథ, కావ్యం నాటిక, బాలసాహిత్యం ఇత్యాది వివిధ ప్రక్రియలలో కైవాదం చూపిన బహుముఖ ప్రజ్ఞాశాలి' అని అభివర్ణించారు. వీరి రచనలన్నీ వీరి కున్న పాండితీప్రకర్షను, భాషాపరిజ్ఞానాన్ని, సాహిత్య సత్యశోధనను, పరిశోధనాశక్తిని, విమర్శనాదృష్టిని, భావుకతను చాటుతాయి. ఇవి అన్నీ వీరి మేధోసంపదకు సంబంధించినవి. వీరి రచనల లోని కవితాసంకలనం 'ఆర్తిగీతాలు' మాత్రం వీరి వ్యక్తిత్వానికి సంబంధించింది. ఇది వీరి హృదయావేదన గీతాలుగా వ్యక్తమైన రచన. వీరి ఆర్తి గీతాలనుగూర్చి శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు పీఠికలో— "ఆర్తిగీతాలు' లోని ఇరవైఏనిమిది గీతాలూ కవి చెప్పుకున్న స్వగతాలవంటివి. ఆయన చైతన్యంలోని అట్టడుగు పొరలనుంచి వెలువడినవి. బాహ్యమైన పొరల్లోనే తేడాలుతప్ప శ్రీశ్రీ అన్నట్లు 'అంతరంగం అట్టడుగున మాత్రం అంతమంది మీ మానవులమే' కనుక ఇవి ఎంత స్వగతాలో అంత సార్వజనీనాలు. శబ్దశిల్పంవల్లా, గతి చమత్కారంవల్లా కాక కేవలం అనుభూతి నిజాయితీతో రచనను కవిత్వం చెయ్యాలని యత్నించిన గీతాలివి' అని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

ఈ ఆర్తిగీతాలలో కవిగారి భక్తిప్రవృత్తులు ఆవేదన నిజాయితీ, సత్యప్రకటన, శాంతం, దయ పరోపకారం మొదలైన ఉత్తమ మానవ లక్షణాలు వ్యక్తమవుతాయి. కవి తన హృదయగత ఆర్తి భావాలను గీతాలనే దర్పణంలో ప్రతిబింబింపచేశారు. వీరి ఆర్తిగీతాలకు ఉత్తమ కవిత్వాంశ ఉంది. ఏ గీతాన్ని చదివినా ఎంతో అనుభూతి వ్యక్తమవుతుంది. మళ్ళీ మళ్ళీ చదవాలనే తపన కలుగుతుంది. కాబట్టి ఈ కవితా సంకలనాన్ని ఉత్తమ కవితా రచన అని చెప్పవచ్చు. ఈ ఆర్తి గీతాలు కవి అనుభూతులకు, అనుభవాలకు, ఆవేదనలకు సంబంధించినవి అయినా ఇవి సర్వజనులకూ వర్తిస్తాయి. కవి బాహ్యరూపంగా ఎంతటి ప్రసన్నమూర్తులో, అంతస్స్వరూపంగా అంతటి కోమల స్వభావులు. వీరికిసాటి మానవులపట్ల ఎంతటి ప్రేమయో, భగవంతుని పట్ల అంతటి భక్తి విశ్వాసాలున్నాయి. వారు ఇంతటి అభ్యున్నతస్థితికి రావటానికి దైవానుగ్రహమే కారణమని విశ్వసించిన వినయ సంపన్నులు.

"స్వామి" అనేగీతంలో కవిగారు ఆకలితో ఆహారాన్ని తిన్నట్లు, దప్పిక కలిగినవాడు నీళ్ళు త్రాగినట్లు, లోభివాడు డబ్బును లెక్కించినట్లు, వయస్సును సౌందర్యాన్ని లెక్క చేయక భర్తను భార్య ప్రేమించినట్లు, కోరిక కలిగినవాడు అభిమానం వదలుకొని అధికారిని పొగడునట్లు అంత తీవ్రంగా గాఢంగా, ఆవేశంగా తెగబడి

తాను భగవంతుని ప్రార్థించలేనని దైవానికి విన్నవించుకున్నాడు. తాను ముక్తి కోసం ప్రార్థించ డంలేదని, తనకు కావలసింది కష్టాలు వచ్చినప్పుడు తట్టుకోగల్గిన ధైర్యం మనస్సు బేల అయినప్పుడు స్థిరత్వం వీటిని అనుగ్రహిస్తే చాలునని ప్రార్థిస్తూ

'ఆకలి గొన్నవాడు
అవురావురుమని భుజించినట్లు
దప్పిక గొన్నవాడు
గటగట నీళ్ళు తాగినట్లు
అంత తీవ్రంగాస్వామి!
నిన్ను నేను అనుభవించలేను

విపత్తు నన్ను ఆవరించినప్పుడు
ప్రసాదించు నాకు అకుంఠితధైర్యం
మనస్సు అతిపేద అయినప్పుడు
అలంకరించు నాకు అచంచల స్థైర్యం'

అనే గీతాన్ని రచించారు.

సామాన్యజనుల దృష్టిలో సంపద అంటే ధన ధాన్యాలు, బంగారు మణులు, రత్నాలు మొదలైన వని అర్థం ఇది సాధారణమైన లౌకిక సంపద. ఇది కాలగర్భంలో నశించిపోయే సంపద. దీనిని చూసుకొని అజ్ఞానులు అహంకారంతో విర్రవీగుతూ పేదప్రజలను అవహేళన చేస్తుంటారు. నశ్వరమైన డబ్బుకోసం ఎన్నెన్నో క్రూరాతిక్రూరమైన పనులు చేస్తూ ఉంటారు. మానవుడు జీవించడం కోసం ఈ లౌకిక సంపద అవసరమే కానీ జీవితపరమార్థం కోసం మానవుడు సంపాదించవలసిన అద్భుతం సంపద ఒకటుంది. అది 'భక్తి'. ఈ అద్భుత సంపదకు శత్రుభయం, దొంగలభయం అక్కర లేదు. దాచుకోవడానికి బ్యాంకులకు వెళ్ళవలసిన పనిలేదు. ఆదాయపు పన్ను పడదు. అలాంటి ఆ పన్నులపాలిటి పెన్నిధి అయిన 'భక్తి'ని తనకు ప్రసాదించమని కవిగారు—

'జాతిభేదం సోకనిది
జ్ఞాతివైరం తాకనిది
ఏ పన్నులూ అక్కరలేనిది
ఆ పన్నులపాలిటి పెన్నిధి
తరగనిది కరగనిది చెరగనిది
హృదయక్షేత్రంలో
ఉదయించిన ప్రేమబీజం
ఆర్ద్రభావ జలాలలో పెరిగి
అంతులేని వృక్షంగా పరిణమించి
అమలినమైన 'భక్తి'గా పరిఢవిల్లనీ!
భగవన్!
అనుగ్రహించు నాకు
ఆ అద్భుత సంపద'

అని భగవంతుని అర్థించారు. పదిహేనవ శతాబ్దంలో తాళ్ళపాక అన్నమాచార్యుల కూడా నిజమైన ధనం భగవంతుడే అని తెలుపుతూ...

'ఇచ్చలో కోరేవల్లా ఇచ్చేధనము
అచ్యుత నామమెపో అధికపు ధనము'

అనే కీర్తన వ్రాశాడు.

భగవంతుడు మనలను మానవులుగా పుట్టించి నందుకు అయినా కృతజ్ఞతగా పూజలు చేయాలి. ఈ పూజలు కర్మపూజలు, మానసపూజలు అని రెండు విధాలు. శరీరసంబంధమైన పూజలు కర్మ పూజలు ఇవి అర్చనలు, భజనలు, కైంకర్యాలు, యజ్ఞయాగాదులు మొదలైనవి. మనస్సును భగ వంతునిపై లగ్నం చేయడానికే ఈ పూజలు చేస్తారు కొందరు తమతృప్తికోసమో, కొందరు తమ శరీర మనస్సులను రెండినీ భగవంతునికి వినియోగించా లనే భావనతోనో ఈ కర్మపూజలు చేస్తుంటారు.

ఇవి శ్రమతోను, ఖర్చులతోను కూడుకొన్నవి. మనస్సు భగవంతునిపై దృఢంగా కేంద్రీకృతమైనప్పుడు ఈ పూజలలేవీ అక్కరలేదు భగవంతుని కేవలం మనస్సుతో ధ్యానించడమే మానసపూజ. ఈ మానసపూజ అలవడితే సర్వకాలసర్వావస్థలలోను దైవాన్ని సులభంగా, సుఖంగా, ధ్యానించుకోవచ్చు. ఎందరో భక్తులు సాంసారిక లౌకిక కార్యకలాపాలలో నిమగ్నులైనా తమ మనస్సును మాత్రం దైవానికి అంకితంచేసి నిత్యకర్మలు చేస్తుంటారు. మానసపూజ చేయడానికి ప్రయత్నించడం, మధ్యమధ్యలో లౌకికకర్మలు గుర్తురావడం మనస్సు భగవంతుని నుండి మరలడం, భక్తుడు ఆవేదన చెందడం, ఏనాటికైనా దైవానికి అకుంఠిత మానసపూజ చేయాలనే పట్టుదల కలగడం భక్తులకు నిత్యమూ ప్రార్థనాసమయంలో అనుభవైకవేద్యమే. కవిగారు కూడా ఆవే భావాలను, తన కోరికను దైవానికి వ్యక్తంచేస్తూ—

'దేవా ! నిలువలేను మనస్సు
ఒక్కనిమిషమైనా
సలుపలేను మానసపూజ

కళ్ళుమూసుకోగానే
తుళ్ళిపడే తలపుతరంగాలు
ఒళ్ళువిరుచుకొని
సుళ్ళు తిరగసాగాయి
క్షుభిత మానసాంబుధిలో

—

తలపు చెదరిపోతుంది
మనస్సు నిలవలేదు నీపై
అందువల్లనే
చేస్తాను బిగ్గరగా భజన
చేస్తాను సగుణోపాసన
కొన్నాళ్ళకైనా
తలపు నిలవగలనేమో
మనస్సు మరల్చగలనేమో
నీపై అని నా ఆశ'

అనే గీతం వ్రాశారు.

ఏడుకొండలు అనగానే తిరుపతి ఏడుకొండలు గుర్తువస్తాయి. కొండలు ఎంతో కర్కశమైనవి. అలాగే మానవునిలోని దుర్గుణాలు కూడా బలీయమైనవి. ఇవి బలపడితే మానవుడు రాక్షసుడుగా మారి వికృత కృత్యాలు చేస్తాడు. కవిగారు అసూయ, కామం, గర్వం, కోపం, స్వార్థం, వ్యామోహం, అధికారదాహం అనే ఏడు దుర్గుణాలను ఒక్కొక్క కొండగా భావించి ఈ ఏడుకొండలను అధిగమించినప్పుడే అంటే వాటిని నిగ్రహించినప్పుడే మనసు నిర్మలమవుతుందని, నిర్మలంగా బ్రతికినప్పుడే మానవునికి దైవదర్శనం కలుగుతుందని, లేకుంటే దైవదర్శనం అసంభవమని జ్ఞానబోధచేస్తూ,

"ఈర్ష్యాద్రిఎక్కాలి
మోహాద్రి మెట్టాలి
గర్వాచలం గడవాలి
క్రోధాచలం అంతుచూడాలి
స్వార్థాచలం దాటాలి
వ్యామోహ పర్వతం ప్రాకాలి
ఈ ఏడుకొండలూ గడిస్తేగాని
ఆ దేవదేవుడి దర్శనంకాదు"

అనే గీతాన్ని రచించారు.

భగవంతుడు మానవులను ఉద్ధరించడంకోసం ఈభూమిపై రాముడుగా, కృష్ణుడుగా, శ్రీనివాసుడుగా ఇంకా అనేక నామరూపాలలో అవతరిస్తుంటాడు. భగవంతుడు తన భక్తులను కాపాడడంకోసం

దుర్భరమైన అనేక కష్టాలకు లోనవుతుంటాడు. తాను కష్టాలు పడుతూ తన భక్తులతో దయతో రక్షిస్తుంటాడు. అందువల్లనే సాటిమానవుల కోసం కష్టపడే మానవులను దైవాంశ సంభూతులని చెబుతుంటారు. దీపం తాను కాలుతూ ఇతరులకు వెలుగునిస్తుంది. అలాగే కష్టజీవులైన కార్మికులు, కర్షకులు, సంఘసేవికలు, త్యాగమూర్తులు, దేశభక్తులు మొదలైన కష్టజీవులు పరోపకారంకోసం అహర్నిశలూ నిర్విరామంగా కృషి చేస్తుంటారని, వారిలో మాధవాంశ కనిపిస్తోందని చెబుతూ కవిగారు—

'అడుగో అడుగో
అడుగులు బొబ్బలెత్తే యెర్రని యెండలో
బండలు పగుళ్ళుచూపే మండుటెండలో
కండలు కరిగించి ఒడలువంచి
కంకరరోడ్డు వేస్తున్నాడు
స్వార్థమన్నది మచ్చుకైనాలేని
ఆకష్టచరితుని శరీరంలో
ఇంకిపోతున్న స్వేదధారలో
కనిపిస్తున్నది మాధవాంశ !
పాషాణంలాంటి గడ్డను
పట్టుపరుపులా చేసి
అందులో పండిస్తున్నాడు పెక్కుపంటలు
అందిస్తున్నాడు జనానికి తిండితీర్థాలు

— —

ఆసేవానిరతుని దైన్యంలో
కనిపిస్తున్నది మాధవాంశ !
స్వార్థచింతన చంపుకుని
సేవానిరతి పెంచుకుని
సాటిమానవుల సౌఖ్యం కోసం
నిర్విరామంగా కృషిచేసే
తపోధనులు త్యాగమూర్తులు
వీరందరి కృషిలో
కనిపిస్తున్నది మాధవాంశ'

అనేగీతాన్ని మన కళ్ళముందు దృశ్యాలు కనిపించేవిధంగా వ్రాశారు.

పాలలో వెన్నదాగివున్నట్లుగా ప్రతి మనిషిలోను మేధస్సు ఉంటుంది. ఇది సులభంగా కనిపించదు. అలాగే జంతుత్వమూ ఉంటుంది. ఇది అద్దంలో ముఖం కనిపించినట్లు సులభంగా కనిపిస్తుంది. అంటే చెడు తొందరగా సులభంగా బయటపడుతుంది ప్రచారమవుతుంది. మంచి ఆలస్యంగా అతికష్టంగా బయటపడుతుంది. తొందరగా ప్రచారం కాదు. ఇది విజ్ఞులకు అనుభవైకవేద్యమే. కొంతమంది నల్లనివన్నీ నీళ్ళు అని, తెల్లనివన్నీ పాలు అని అజ్ఞానంగా భ్రమపడి నమ్ముతుంటారు. కొంతమంది పైకి పిచ్చివాళ్ళులాగా కనిపిస్తూ, లోపల రాక్షసుల్లా ప్రవర్తిస్తూ తేనెపూసిన కత్తులుగా, పయోముఖ విషకుంభాలుగా కనబడేవారు తామర తంపరలుగా ఉన్నారు. ఈ కాలంలో ఎవరు ఎలాంటివారో తెలుసుకోవడం అతిక్లిష్టమైన విషయం కాబట్టి పైకి కనిపించిందే నిజం అని నమ్మడం వట్టి మూర్ఖత్వమే అవుతుంది. కంటికి కనిపించకున్నా నిజం నిజమేనని, కంటికి కనిపించకున్నా నిజాన్ని నమ్ముతానని తనదృష్టిలో ప్రతిమనిషి కూడా మనీషియేనని అంటూ కవిగారు—

'మనిషిలో మనీషి ఉన్నాడు
అతడు సులభంగా కనిపించడు
పాలలో వెన్నలా!
మనిషిలో మృగమున్నది
అది సులభంగా కనిపిస్తుంది
అద్దంలో ముఖంలా!
కంటికి కనిపించేదే
నిజమనుకుంటారు కొందరు

కంటికి కనిపించకున్నా
నిజమనుకుంటాను నేను
అందుకే
ను దృష్టితో ప్రతి మనిషీ మనీషి'

అనే గీతాన్ని రచించారు.

ప్రపంచం ఎప్పుడూ అభివృద్ధి మార్గం లోనే పయనించాలని, ప్రభుత్వం ప్రజల సంక్షేమంకోసమే పాటు పడాలని, చీకట్లు పోయి వెలుగు రావాలని బాధలు పోయి సుఖశాంతులు లభించాలని, మనుష్యులలో క్రూరత్వం నశించి మానవత్వం పెరగాలని, అసూయాద్వేషాలు అంతరించి ప్రేమ ప్రకాశించాలని, లోకమంతా కూడా ప్రశాంతంగా ఉండాలని కవిగారు దయా హృదయంతో విశ్వశ్రేయస్సును అపేక్షిస్తూ—

'ప్రగతిమార్గాన జగతినడవాలి
ప్రజలకోసమై ప్రభుతసాగాలి
ఇరులు పోవాలి వెలుగురావాలి
కలత తొలగాలి సుఖము కలగాలి
దానవత్వమ్ము తొలగిపోవాలి
మానవత్వమ్ము వెల్లివిరియాలి
ఈర్ష్యమలగాలి ప్రేమవెలగాలి
లోకమంతట శాంతి నిండాలి'

అనే భరత వాక్య గీతాన్ని రచించారు.

జాతీయాచార్య చల్లా రాధాకృష్ణ శర్మగారి ఆర్తి గీతాలన్నీ కూడా వారి భక్తి తత్పరతను, సత్యనిష్ఠా గరిష్టతను దయాదాక్షిణ్యాలను, మానవతను చాటుతున్నాయి. సంగీతాంశతో కూడుకున్న వీరి గీతాలు హాయిగా పాడుకోవడానికి కూడా అనుకూలంగా ఉన్నాయి. వీరు ఆర్తిగీతాలలో అంతి అంతి లలిత పదాలలో అనంతమైన అర్థ భావాలను, విశ్వజనీనమైన భక్తి మానవతా ధర్మాలను పొందు పరచారు. వీరిశైలి పాఠకులను మళ్ళీ మళ్ళీ చదివించే విధంగా ఎంతో రమ్యంగా, మృదురీతిగా ఉంది. ఇందులోని ప్రతిగీతం కూడా ఒక్కొక్క ఆణిముత్యమే. ఈగీతాలు వారి దయామృత తరంగిణి అయిన హృదయాన్ని తెలుసుకోవడానికే కాకుండా అందరూ చదువుకొని ఉత్తమ మానవ గుణాలను పెంపొందించు కోవడానికి కూడా దోహదం చేస్తాయనడంలో సందేహం లేదు.

# కవితావీధి

## స్పర్శ

భగ్వాన్

మౌనం మంచులా మనిషిని కప్పినప్పుడు
ఒక్క చేతి స్పర్శ
వేయిసూర్యుళ్ళను ప్రసవిస్తుంది–
జీవితం వచ్చిపుండైనప్పుడు
ఒక్క వాక్కు స్పర్శ
శస్త్రరహిత చికిత్స చేస్తుంది–
కన్నీటి బిందువులను తుడిచే
ఒక్క మునివేలిస్పర్శ
సంకల్ప బలాన్ని ప్రసాదిస్తుంది–
జీవన వాస్తవ చిత్రణ పొదిగిన పేజీ
ఒక్క చూపు స్పర్శతో
ఆరని అగ్నికణమవుతుంది–
శీతగాలి స్పర్శతోనే
మబ్బు జల్లనవుతుంది
ఒక్క ఆత్మీయతాస్పర్శతోనే
మనిషి హరివిల్లవుతాడు—
దీపాల స్పర్శతోనే
రహదారి ప్రాణంతో సాగిపోతుంది
ఒక్క చిరునవ్వు స్పర్శతోనే
మనిషి మహోన్నత పథంపైపు గమిస్తాడు–
నాగలి కర్రుస్పర్శతోనే
పొలాలు పంటలజెండా ఎగరేస్తాయి
ఒక్క ఆదరణ పూరిత స్పర్శతోనే
మనిషి పునరుజ్జీవనం పొందుతాడు—
పిట్టల రెక్కల చప్పుళ్ళ స్పర్శతోనే
చెట్లు వెలుగుతాయి
పరస్పరం పలకరింపుల స్పర్శతోనే
మనిషి చైతన్యదీపపు శిఖఅవుతాడు—
స్పర్శ–మనిషికి ఒక జీవం
స్పర్శ–జాతికి ఒక నీతి
స్పర్శ–సంఘానికి ఒక సందేశం
మనిషికి మనిషికి మధ్య స్పర్శలు కరువైతే
మనుష్యుల ముందుచూపు కోల్పోయినట్టే
స్పర్శలు బరువైన సమాజం
స్పర్శలతో మృతప్రాయమైనట్టే —
స్పర్శలను ఆవాహన చేసే సంఘం
సమానత్వాన్ని చాటుకుంటూ పురోగమిస్తుంది
స్పర్శలను ఆరాధించే సమాజంలోనే
సరికొత్త జీవశక్తి చేతులు చాచుకుంటూ విస
రిమంది

లంకలకోడేరు–534 250, పాలకొల్లు మండలం, ప. గో. జిల్లా

# భావ వైపరీత్యం

జి. శ్రీశైలం

విప్పారిన ఆకాశం ఎదురుగా వున్నా
విశాల భావం రాదేమిటి
తారలజిలుగు ఉల్లాస పరచదేమిటి
సముద్రమంత అవకాశం
ఎందుకు కొరగాదేమిటి
ఇరుకుగదిలో దిక్కుతోచని
ఘోరనరకం అనుభవిస్తూ
అంతంలేని అందమైన వాతావరణంలో
తిష్ఠవేసినా ప్రశాంతత చేకూరదేమిటి
హృదయ వికాసం కలుగదేమిటి
భూమిని చీల్చుకువచ్చే మొక్కలకున్న
చైతన్యం లేకపోవడమేమిటి
నీరసంగా నిస్తేజంగా కాలం గడవడమేమిటి
కదలని గొంగళ్ళవలె వున్నందుకే
అవినీతి పారిజాతాలు
ఊరేగుతున్నాయన్న మాట
అదనుగా వట్టుసిల్కుదారం పోగుకూడా
ఎగిరెగిరి పడుతున్నదన్న మాట.

ఇంటి నెం. 1–84 హైదర్‌నగర్, హైదరాబాదు–500 872.

# కర్మయోగం

ఐతా చంద్రయ్య

జీవన యానంలో
సంసారసాగరం లోతులు కొలుస్తుంటే
అలసి-సొలసి అల్లాడుతుంది తనువు
వల్లకాదని, ముందుకు పోనని
మూతి ముడుచుక్కూచుంటది
ఊహల గువ్వలకు
హుషారు సోకింది
ఆకాశం తోసేసినా
శంభుని శిరస్సు జారినా
పలుగు రాళ్ళలో నలిగినా
బాటలో ముళ్ళు కెలికినా
సామ్రాట్లు నెత్తురు కత్తులు కడిగినా
చరిత్రకు సాక్షిగా సాగిపోతుంది "గంగ"
పరవళ్ళు తొక్కుతూంది శుభంగ
మైదానాల గిలిగింతల్లో పులకిస్తూ
పొలాలగళాలు తడిపేస్తుంది
మానవాళి ఆకలి మంటలనార్పుతుంది
అలసటకు ఆమడదూరంలో ఉంటుంది
సముద్ర గర్భంలో తలదాచుకున్నా
తలరాతను నిందించుకోదు
కులమతాల నెలవులు మరచి
సమతా మమతల తలపులు తెరచి
ప్రాణుల ప్రాణాలు నిలపడమే
ప్రాణప్రదంగా తలంచి,

తరాల అంతరాల తలుపులు మూసేసి
నిరంతరం తపిస్తున్న "గాలి"
అలసటతో ఆగిపోతుందా?
రెక్కలు విప్పి, ముక్కులుదాచి
సంబరాలు సింగారించుకుని
అంబర వీధిలో, అలవరుసలతో
మొయిలు రాయబారులతో
సయ్యాటలాడుతూ-సైగలుచేస్తూ
పయనిస్తున్న పక్షుల గుంపులు
ఎక్కడ బయలుదేరాయో,
ఎటు చేరుకోవాలో
అలసట ఆనవాళ్లు సోకకుండా
గమ్యం దిశలో గర్వంగా ప్రయాణం
కృషీవలుని కుడి-ఎడమ భుజాలై
హర్షామోదం అందలమెక్కి
వందల ఎకరాల్ని
పసందుగా దున్నేస్తున్న
కాడి జోడెడ్ల కాళ్ళకు
బ్రేకుల మేకులు దిగుతున్నాయా?
విశ్రాంతి కావాలని విడిపోతున్నాయా?
గంగకు లేదు అలసట-గాలికి లేదు అలసట
పక్షికిలేదు అలసట-పశువుకు లేదు అలసట
ఊహల గువ్వలు గూటికి చేరగానే
తనువు అలసటను తన్నేస్తుంది

4-4-11 సిరపుర, సిద్దిపేట-502 103.

# వరిపైరుల అణువణువున"

యస్. లక్ష్మీనారాయణాచార్య

తిమిరం తననగరం దరిచేరనీక
సమరం చేయునుభానుడు
మోడుచివురు లెత్తువరకు
పోరాడును కాలంతో
హాలాహల ఖంగంతో
ఆగలేదు అమరులు
అమృత ఫలమందువరకు
తరచిరి క్షీరార్ణవం
వాసంతం వచ్చువరకు
తపోదీక్ష నుండి పికం
సాధించును మధురగళం
అమవస నిశి కబళించగ, శశి
చిరురూపు గనుద్భవించి
పున్నమచంద్రుడుగ మారి
పుడమికి వెన్నెల పండుగచేయును
అగ్నిలోన కాగి పసిడి
ఆభరణమై మెరయును
అందానికి అందమై
ఆనందనందనం పూయించును

జీర్ణపర్ణ నైరాశ్యం
శిశిరంలో రాల్చితుజం
ఆశాపల్లవ నవ
ఆయుధాలు ధరియించును
కొండకోన అడ్డంకులు
ఎన్నెదురైనా?
గమ్య జలధి చేరువరకు
నదీగమన మాగదు
తన జీవిత మల్పమని
ఆరాటం చెందక విరి
పరిమళాల పరమాన్నం
భువి నేస్తానికి పంచును
దీపం తను కాలిపోతు
ఇరులనణచు యుద్ధంలో
ఇనుడిబాటనే నడచును
పట్టుదలే పొలంగా
శ్రమసేద్యం
ఆశయాల వరిపైరుల
అణువణువున ధాన్యం

ప్లాట్ నెం. 29/ఎ, బిహైండ్ లిటిల్ ఫ్లవర్ హైస్కూల్, యల్. బి. నగర్, హైదరాబాద్500968

# వార్తా వాహిని

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ— ఆంధ్ర—విజయవాడ సోమూరి వెంకట్రామయ్యా హాలు ప్రారంభోత్సవము

ది. 14–3–94 తేదీ సా॥ 4 గంటలకు మాచవరంలో, హిందీప్రచారక ప్రశిక్షణవిద్యాలయం పైభాగములో నిర్మించబడిన క్రొత్త హాలునకు ప్రారంభోత్సవం వైభవోపేతంగా జరిగింది. దక్షిణ భారత హిందీ ప్రచారసభ—మద్రాసు ప్రధాన కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామిగారు అధ్యక్షత వహించారు. సిద్ధార్థ కాలేజి కోశాధ్యక్షులు శ్రీ ముమ్మనేని సుబ్బారావుగారు ముఖ్యఅతిథిగా, పాల్గొన్నారు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర అధ్యక్షులు, శ్రీబోయపాటి నాగేశ్వరరావు గారు, రిబ్బను కత్తిరించి హాలును ప్రారంభించారు. తొలుత శాస్త్రీయంగా పూజా కార్యక్రమం నిర్వహించబడినది. సభకు విచ్చేసిన అనేకమంది పురప్రముఖులు, స్వాతంత్ర్య సమరయోధులు. సాహితీవేత్తలు, హిందీప్రచారకులు, ప్రశిక్షణ విద్యార్థినీ విద్యార్థులకు ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ అన్నదానం శంకరశాస్త్రిగారు స్వాగతము పలికిరి. ముఖ్య అతిథులను వేదికపైకి ఆహ్వానించిరి. శ్రీ వెంకట్రామయ్యగారు అతిథులందరికి అల్పాహార విందు యేర్పాటుచేసిరి. విందు అనంతరం విద్యార్థినుల ప్రార్థనాగీతంతో సభ ప్రారంభమైనది.

శ్రీ ముమ్మనేని సుబ్బారావుగారు శ్రీసోమూరి వెంకట్రామయ్యగారి చిత్ర పటమును ఆవిష్కరించిరి. అనంతరం జ్యోతి వెలిగించి, శ్రీసోమూరి వెంకట్రామయ్యగారు హిందీ ప్రచారక ప్రశిక్షణ సెషన్ ప్రారంభించగా, ఆంధ్రసభ తరపున అధ్యక్షులు శ్రీ రామస్వామిగారు, శ్రీసోమూరి వెంకట్రామయ్యగార్ని దుశ్శాలువ, ఫలపుష్పాదులతో సన్మానించారు. ఇదేసందర్భంలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ—మద్రాసు కార్యాధ్యక్షులు శ్రీరాజ వెంకటేశ్వరరావుగారు తాను రచించిన, 'అంతస్థల్' హిందీ కవితా సంగ్రహమును, కృతి కర్త శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారికి సమర్పించిరి.

సభాధ్యక్షులు శ్రీరామస్వామిగారు తన ప్రసంగంలో సభకు 75 సంవత్సరాలు నిండిన సందర్భములో జరుగనున్న అమృతోత్సవాలను గురించి వివరించిరి. ఈనెల 21వ, తేదీన ఢిల్లీలో భారత ప్రధానమంత్రి ద.భా. హిందీ ప్రచారసభ—మద్రాసు అధ్యక్షులైన శ్రీ పి. వి. నరసింహారావుగారి నివాసములో, అమృతోత్సవాల ప్రారంభోత్సవంగావించెదరని నుడివిరి. శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు తన ప్రసంగంలో ఈ భవనానికి గల విశిష్ట ప్రాముఖ్యతను వివరించారు. ఈ భవనపుపునాది రాయిని జాతిపిత మహాత్మాగాంధీజీ 1946లో ఆశీర్వదించి రనియు, గాంధీజీ అను యాయులు శ్రీ వినోబా భావేగారు 1949లో దానిని స్థాపించా

రనియు, 1969లో సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌గారు ప్రారంభోత్సవం చేశారనియు, అప్పటి ముఖ్యమంత్రిగారైన శ్రీకాసు బ్రాహ్మానందరెడ్డిగారు సభకు అధ్యక్షత వహించారనియు నుడివిరి. అలాంటి యీ భవనము పై నిర్మించిన యీ హాలుకి 50 వేలు భూరి విరాళ మొసంగిన, ధర్మదాత, స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ సోమూరి వెంకట్రామయ్య, గారి పేరు పెట్టుట సముచితమని, ఇది మనందరికి గర్వకారణమనిరి, భారతీయ సంస్కృతిలోని దానశీలతను వివరించుచూ, శ్రీ సోమూరి వారి దాతృత్వమును, గుణగణాలను బహుముఖంగా శ్లాఘించారు.

శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారు తనకు జరిగిన సన్మానమునకు కృతజ్ఞత తెలుపుచూ, తాను మహాత్మాగాంధీజీ వలన ప్రేరణ పొందినవాడనై, కాశీకి వెళ్ళి హిందీ నభ్యసించుటయేగాక, దేశభక్తునిగా మారిన ఘట్టము లెన్నింటినో మనోరంజకంగా వివరించారు. చివరగా తనకు కృతి సమర్పణ చేసిన శ్రీ కాజ వెంకటేశ్వరరావుగారిని నూతన ఖద్దరు వస్త్రములతో సన్మానించిరి.

ముఖ్యఅతిథి శ్రీ ముమ్మనేని సుబ్బారావుగారు తమ సందేశములో, శ్రీ సోమూరి వారిని, అన్ని రంగముల వారు సన్మానించుటకు కారణం, వారు చేస్తున్న వివిధ సంఘసేవా కార్యములు, వాటియందు చూపుచున్న శ్రద్ధ, ఆర్థిక సహకారము లేనని తెలియజేసిరి. అనంతరం హిందీ బి.ఎడ్ కాలేజి లెక్చరర్ శ్రీమతి సీతానాయుడుగారు ధన్యవాద సమర్పణ చేయగా 'జనగణమన' జాతీయ గీతాలాపనతో సభ జయప్రదంగా ముగిసింది.

## ప్రమాణపత్ర వితరణోత్సవము

తేది 3-3-94 నాడు సాయంత్రము 3 గంటలకు ఉషోదయా విద్యామందిరమునందు డిశంబరు నెలలో జరిగిన అమృత హిందీ పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణపత్ర వితరణోత్సవము జరిగినది. సభకు అధ్యక్షత వహించిన కన్వీనర్ శ్రీ యం. శివమోహన్‌గారు హిందీ భాషాభివృద్ధికి ప్రచారమునకూ పాటుపడుతున్న హిందీ ప్రచారకులు శ్రీ యం శరిబనయ్య గారిని ప్రశంశిస్తూ, హిందీ ప్రచారానికి విద్యామందిరం తరపున తమ వంతు సహాయ సహకారాలు అందిసామని తెలియజేసిరి.

శ్రీమతి యం. సుజాతగారిచే వందన సమర్పణ జరిగెను.

ఆంధ్ర రాష్ట్ర సందలి వివిధ జిల్లాలలో జరుగనున్న అమృతోత్సవ మహాసభల సందర్భమున సన్మానింపబడు ప్రచారకుల పేర్లు

| క్ర. సంఖ్య | పేరు | గ్రామము/పట్టణం | జిల్లా |
|---|---|---|---|
| 1 | 2 | 3 | |
| | సర్వశ్రీ | | |
| 1. | శ్రీ పి. లక్ష్మణ శర్మ | శ్రీకాకుళం | శ్రీకాకుళం |
| 2. | శ్రీ వి. దుర్గాదాస్ | పొందూరు | శ్రీకాకుళం |
| 3. | శ్రీ వి.వి.ఎస్. సత్యవతి | విస్సన్నపేట | విజయనగరం |
| 4. | శ్రీ బి.పి. మిశ్ర | విజయనగరం | విజయనగరం |
| 5. | వి. సుకుమారి | విజయనగరం | విజయనగరం |
| 6. | వై. ఆంజనేయులు | విజయనగరం | విజయనగరం |
| 7. | ఎన్. జ్యోతి | విజయనగరం | విజయనగరం |
| 8. | పి.వి. రామానుజాచార్యులు | విజయనగరం | విజయనగరం |
| 9. | పి.ఎస్. జగ్గారావు | అనకాపల్లి | విశాఖపట్నం |
| 10. | డి. వరహ రత్నం | విశాఖపట్నం | విశాఖపట్నం |
| 11. | కె.బి. మణి | విశాఖపట్నం | విశాఖపట్నం |
| 12. | కె. సత్యనారాయణమూర్తి | విశాఖపట్నం | విశాఖపట్నం |
| 13. | ఎస్. పైడన్న | విశాఖపట్నం | విశాఖపట్నం |
| 14. | డి. అమరేశ్వరి | విశాఖపట్నం | విశాఖపట్నం |
| 15. | పి. మహేశ్వరరావు | కాకినాడ | |
| 16. | ఎం. సత్యనారాయణరెడ్డి | జి.మామిడాడ | తూర్పు గోదావరి |
| 17. | టి. సుబ్బలక్ష్మి | రాజమండ్రి | తూర్పు గోదావరి |
| 18. | ఇ. వెంకయ్య | పెద్దాపురం | తూర్పు గోదావరి |

| | | | |
|---|---|---|---|
| 19. | ఎస్, సోమన్న | మొగలికుదురు | తూర్పు గోదావరి |
| 20. | జి. విశ్వనాథం | కాకినాడ | తూర్పు గోదావరి |
| 21. | పి. సీత | కాకినాడ | తూర్పు గోదావరి |
| 22. | జి. వెంకటాచార్యులు | ఏలూరు | పశ్చిమ గోదావరి |
| 23. | ఎం. జగన్మోహనరావు | జంగారెడ్డి గూడెం | పశ్చిమ గోదావరి |
| 24. | జి. కస్తూరి | నిడదవోలు | పశ్చిమ గోదావరి |
| 25. | వి.వి. సుబ్రహ్మణ్యం | ఏలూరు | పశ్చిమ గోదావరి |
| 26. | షేక్ ఇమామ్ సాహెబ్ | భీమవరం | పశ్చిమ గోదావరి |
| 27. | టి. ముత్యావతి | తణుకు | పశ్చిమ గోదావరి |
| 28. | ఎమ్. సురేఖ | జంగారెడ్డి గూడెం | పశ్చిమ గోదావరి |
| 29. | కె, గంగా భవాని | తాడేపల్లి గూడెం | పశ్చిమ గోదావరి |
| 30. | ఎన్. అనసూయ | జంగారెడ్డిగూడెం | పశ్చిమ గోదావరి |
| 31. | ఎన్. పద్మావతి | ఏలూరు | పశ్చిమ గోదావరి |
| 32. | వెత్స పాండురంగారావు | ఏలూరు | పశ్చిమ గోదావరి |
| 33. | కే, కస్తూరిబాయి గాంధీ | కొవ్వూరు | పశ్చిమ గోదావరి |
| 34. | కాజ వెంకటేశ్వరరావు | గన్నవరం | కృష్ణా |
| 35. | బి. జె చంద్రకళ | నందిగామ | కృష్ణా |
| 36. | కే. సత్యనారాయణరాజు | నూజివీడు | కృష్ణా |
| 37. | సి. హెచ్. శేషగిరిరావు | మచిలీపట్టణం | కృష్ణా |
| 38. | టి. ఎన్. వి. సాయికుమారి | మచిలీపట్టణం | కృష్ణా |
| 39. | సి. విజయభార్గవి | మచిలీపట్టణం | కృష్ణా |
| 40. | సి. సుబ్బలక్ష్మి | మచిలీపట్టణం | కృష్ణా |
| 41. | బి. ఇందిరాదేవి | గుడివాడ | కృష్ణా |
| 42. | ఎస్. వి. సుబ్బారెడ్డి | వేలేరు | కృష్ణా |
| 43. | ఎ. వి. ఎ. శాస్త్రి | చల్లపల్లి | కృష్ణా |
| 44. | పి. వి. సుబ్రహ్మణ్యేశ్వరరావు | పెంజెంద్ర | కృష్ణా |
| 45. | కే. నాగేశ్వరరావు | చిన్నాపురం | కృష్ణా |
| 46. | కే. ఎ.న్ నాంచారరావు | మచిలీపటణం | కృష్ణా |

| | | | |
|---|---|---|---|
| 47. | డి. పెద. మస్తాన్‌రావు | అవనిగడ్డ | కృష్ణా |
| 48. | ఇ. వి. నాగేశ్వరరావు | సత్తెనపల్లె | గుంటూరు |
| 49. | ఎం. బాపనయ్య | తెనాలి | గుంటూరు |
| 50. | డి. ఉమాదేవి | గుంటూరు | గుంటూరు |
| 51. | ఎన్. కన్యాకుమారి | నర్సరావుపేట | గుంటూరు |
| 52. | కే. అఫీజున్నీసా బేగం | గుంటూరు | గుంటూరు |
| 53. | పి. మంగనాథాచార్యులు | నర్సరావుపేట | గుంటూరు |
| 54. | ఎ. సామ్రాజ్యలక్ష్మి | నెల్లూరు | నెల్లూరు |
| 55. | జే. కృష్ణమూర్తి | గూడూరు | నెల్లూరు |
| 56. | కే. పిచ్చాండి | శ్రీరామపురం | చిత్తూరు |
| 57. | ఏ. ఎస్. కందస్వామి | కత్తెరపల్లె | చిత్తూరు |
| 58 | సి. బాలసుబ్రహ్మణ్యం | తిరుపతి | చిత్తూరు |
| 59. | వేమూరి సుబ్బారావు | మదనపల్లె | చిత్తూరు |
| 60. | పి.రామానుజులురాయుడు | కే. వి. పల్లె | చిత్తూరు |
| 61. | డి. విజయకుమారి | మదనపల్లె | చిత్తూరు |
| 62. | వి. సుబ్బారాయుడు | కడప | కడప |
| 63 | కే. శివశంకర రెడ్డి | కడప | కడప |
| 64. | కె. పి ఇబ్రహీమ్‌ఖాన్ | కడప | కడప |
| 65. | ఐ. గంగిరెడ్డి | పులివెందుల | కడప |
| 66. | ఎమ్. సోమిరెడ్డి | కొండాపురం | కడప |
| 67. | కె. విశాలాక్షమ్మ | అనంతపురం | అనంతపురం |
| 68. | కె. మురళీకృష్ణ | రాయదుర్గ | అనంతపురం |
| 69. | జె. చెన్నకేశవ | రాయదుర్గ | అనంతపురం |
| 70. | వి. సి. భాగ్యమ్మ | అనంతపురం | అనంతపురం |
| 71. | ఎ. బి. భవాని | అనంతపురం | అనంతపురం |
| 72. | ఎస్. ఎ. మహబూబ్ సాహెబ్ | అనంతపురం | అనంతపురం |
| 73. | ఎన్. నరసమ్మ | అనంతపురం | అనంతపురం |
| 74. | జింకా మురళీకృష్ణ | తాడిపత్రి | అనంతపురం |

| | | | |
|---|---|---|---|
| 75. | వి. ఛాయాభూషన్ | అనంతపురం | అనంతపురం |
| 76. | కె. గంగిరెడ్డి | గుంతకల్ | అనంతపురం |
| 77. | ఎస్ మల్లికాబేగం | గుంతకల్ | అనంతపురం |
| 78. | కె. భాగ్యలక్ష్మి | కర్నూలు | కర్నూలు |
| 79. | ఎమ్. హబీబ్‌పాషా | కర్నూలు | కర్నూలు |
| 80. | జి. అమరయ్య | ఆదోని | కర్నూలు |
| 81. | జి. శశిధర్ | ఆదోని | కర్నూలు |
| 82. | ఎమ్. ఆర్. శరత్‌కుమార్ | సికింద్రాబాద్ | హైదరాబాద్ |
| 83. | చవాకుల రామకృష్ణారావు | హైదరాబాద్ | హైదరాబాద్ |
| 84. | చవాకుల విజయనిర్మల | హైదరాబాద్ | హైదరాబాద్ |
| 85. | పి. రవీంద్రనాథ్ | జనగామ | వరంగల్ |
| 86. | ఎమ్ అబ్దుల్ రహమాన్ | జనగామ | వరంగల్ |
| 87. | బి. నరసయ్య | జనగామ | వరంగల్ |
| 88. | టి. స్వరాజ్యం | జనగామ | వరంగల్ |
| 89. | ఎమ్. డి. జహీరుద్దీన్ | సిర్‌పూర్ కాగజ్‌నగర్ | ఆదిలాబాద్ |
| 90. | పి. మోహనరావు | నసపూర్ | ఆదిలాబాద్ |
| 91. | టి. బసవన్న | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ |
| 92. | శ్రీమతి షీలాబాయ్ | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ |
| 93. | ఎమ్. డి. జహంగీర్ ఖాన్ | మహబూబ్‌నగర్ | మహబూబ్‌నగర్ |
| 94. | ఎన్. ఉషానాథ్ | మణుగూరు | ఖమ్మం |

14–8–94 తేదీన జరిగిన హాలు ప్రారంభోత్సవ సందర్భంలో జరిగిన, పూజా కార్యక్రమ భాగంలోని యీ ఛాయా చిత్రములో—

శ్రీ అన్నదానం రామస్వామి గారు, బోయపాటి నాగేశ్వరరావు గారు, కాజ వేంకటేశ్వరరావు గారు
ఎ. శంకరశాస్త్రిగారు, వెనిగళ్ల వేంకటేశ్వరరావుగారు, చవాకుల నరసింహామూర్తిగారు,
మక్కపాటి వేంకటరత్నంగారు, శ్రీ దలాయ్ మొదలగు వారున్నారు.

# స్రవంతి

(యాజమాన్యం తదితర వివరాలు)

[ఫారం 4 (8 వ నిబంధన) ప్రకారము]

1. ప్రచురణ స్థలం : 6-2-959 ఖైరతాబాద్, హైదరాబాద్- 500 004
2. ప్రచురణ వ్యవధి : మాసం
3. ముద్రాపకుని పేరు : ఎ. శంకరశాస్త్రి
   జాతీయత ; భారతీయత
   చిరునామా ; 6-2-959 ఖైరతాబాద్
   హైదరాబాద్-500 004
4. పత్రిక యజమానులు : దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
   6-2-959 ఖైరతాబాద్, హైదరాబాద్-500 004

పైవివరములు నాకు తెలిసినంత వరకు వాస్తవికమైనవని ఇందుమూలముగా తెలియ చేయుచున్నాను.

హైదరాబాద్

తేదీ 28-3-1994

ఎ. శంకరశాస్త్రి

ప్రకాశకులు

Edited Printed and Published by A. Sankara Sastry on benlf of the D. B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.